# వరూధినీ ప్రవరాఖ్యము

DRAMATIC ADAPTATION

OF

PEDDANNA'S MANUCHARITRA

BY

R. V. M. G. RAMA RAO

THE YUVARAJAH OF PITHAPURAM

# అంకితము

తండ్రిగారైన
ఆంధ్రభోజ, సాహిత్య చక్రవర్తి,
శ్రీయుత రాజారావు వేంకటకుమారమహీపతి
సూర్యారావుబహద్దరు, పిఠాపురము మహారాజావారికి
భక్తితో సమర్పితము.

గ్రంథకర్త.

దయతో గ్రమతీసికొన్న
డాక్టరు గిడుగు సీతాపతిగారికి
నా నమస్కారములు ; ధన్యవాదములు.

గ్రంథకర్త.

ఒక రూపాయి

## పాత్ర వర్గము

పెద్దనార్యుడు

దూతిక

లేఖకుడు

ప్రవరుడు

సిద్ధుడు

ఇద్దరు శిష్యులు

ప్రవరుని భార్య

వరూధిని

వరూధిని చెలికత్తెలు ఇద్దరు

మాయాప్రవరుడు

మాయాప్రవరుని చెలికాడు



# ప్ర స్తా వ న

శ్రీ పిఠాపురం యువరాజా శ్రీ రావు వేంకటమహీపతి గంగాధరరామారావుగారు ఆంధ్రలోకమునకు చిరపరిచితులు; ఆగర్భశ్రీమంతులయ్యును నిరాడంబరులు; విద్యాగోష్ఠీప్రియు దనురక్తులు; ఆంధ్రగీర్వాణాంగ్లేయభాషాకోవిదులయి గ్రంథరచనాసామర్థ్య మలవరచుకొన్నవారు. వీరు ఇంతకుముందు రచించిన నాటకములు, ఖండకావ్యములు, ప్రసంగములు మనోహరములని మెప్పు పొందినవి; నవీనాంధ్రకవిమండలిలో వీరికొక ఉన్నతస్థానము లభించినది. వీరి రచనలన్నిటను స్వతంత్రభావనాశక్తి అపూర్వకల్పనాసామర్థ్యము గోచరములు కాగలవని నా నమ్మకము.

ఇప్పుడు వీరు రచించిన ఈ ''వరూధినీ ప్రవరాఖ్యము'' నందలి రచనావిధానము అపూర్వమైనది. ఆంధ్రకవితాపితామహులనబడుచున్న అల్లసాని పెద్దనామాత్యుడు రచించిన స్వారోచిష మనుచరిత్రమనే ప్రబంధములోని మొదటి మూడాశ్వాసములందును గల వరూధినీ ప్రవరుల కథను దృశ్యకావ్యముగా వీరు మార్చినారు. ఇది నాటకరూపమునే తాల్చినను నాటకలక్షణమునకు కొద్దిగా భిన్నమయిన పద్ధతిని రచితమైనది. ఇదియొక నూతన విన్యాసము; దశవిధ రూపకములలో దేనికిని సరిపడనిది. ఇంతకు పూర్వము మనుచరిత్రమందలి కథలను నాటకములుగా రచించినవారు పెద్దనగారి పద్యాలను స్వీకరించుకొన్నారు; గాని సంభాషణ

రూపములోనున్న పద్యాలకేకాని వర్ణనపరములయిన పద్యాలకు వారి నాటకరచనలో అవకాశము లేకపోయినది. ఇప్పు డీ నూతనరచనా విధానములో రెండువిధములయిన పద్యములకును అవకాశము లభించినది. సంభాషణరూపములోనున్న పద్యాలు ఆయాపాత్రముల నోటనుండి వెలువడజేయుట సులభమే. వర్ణనపరములయిన పద్యాలుసైతము చేర్చుకోవలెనన్న సంకల్పముతో వీరు అందుకుతగిన పాత్రములను సందర్భోచితముగానే సృజించి వారినోటనుండి వెలువడజేసినారు: ఆముఖరూపమున పెద్దనగారి పాత్రమునే ప్రవేశపెట్టి కృతికర్తకు, కృతిభర్తకు సంబంధించిన గద్యపద్యభాగములను పలికించినారు. ప్రవరుని శిష్యులపాత్రములను సృజించి వారిచేత ప్రవరుని గార్హస్థ్యజీవితమునకును, సిద్ధునకును సంబంధించిన పద్యములను పలికించినారు. వరూథినీ ప్రవరులు బద్ధముఖులయి గావించిన చేష్టలను, ఆయా దృశ్యములను వర్ణించు పద్యాలను చెలికత్తెల పాత్రములనుసృజించి వారిచే చెప్పించినారు. ఆ విధముననే మాయాప్రవరుని కొక చెలికానిని జోడించి ఆ కడపటి కథాభాగమునకు సంబంధించిన పద్యాలు ఆపాత్రముచేత పలికించినారు. నిశ్శబ్దచలనచిత్రప్రదర్శనములలో నోటిమాటలేక నటించిన పాత్రముల భావములను, వర్తనములను ప్రేక్షకులకు తెలియజేయుటకు వ్యాఖ్యానించే వాచకులవలెనే ఈ వర్ణన పద్యములను ఈ నూతన పాత్రధారులు పలికినా వీరు రూపకమందలి పాత్రములతో సంబంధించిన వారే కనుక నాటకమర్యాద నతిక్రమించినవారు కారు. అయినను ఇది యొక

నూతన రచనావిధానము. దీనికొక క్రొత్తపేరు పెట్టవలసి యున్నది. శ్రవ్యకావ్యమును దృశ్యకావ్యముగా నిరూపింప గల ఈ రచనావిధానమునకు నిరూపక మను పేరు తగినదని నా అభిప్రాయము.

కొన్నిచోట్ల పద్యములలోని కొన్నిభాగములు అసందర్భములుగా కనబడవచ్చు. ఉదాహరణము-"అట సని కాంచె భూమిసురుడు" అని ప్రవరుడే పలుకుట. కాని, తననుగూర్చి తాను చెప్పుకొనునప్పుడు ప్రథమపురుషలో చెప్పుకొనుట సైతము ఒకొకప్పుడు సహజమే.

ఈనిరూపకములోనున్న పద్యాలన్నీ పెద్దనగారు రచించినవే. గద్యభాగాలలో మాత్రము రెండు మూడు చిన్న భాగములే పెద్దనగారు రచించినవి. తక్కిన గ్రంథమంతా శ్రీ యువరాజుగారు రచించినది. వీరు రచించినదంతా నేటి శిష్టజనవ్యావహారికభాషలో ఉన్నది. పెద్దనగారి కావ్యభాషతో నేటి వ్యావహారికభాష జోడించుట ఉచితమా యని కొందరు ప్రశ్నించవచ్చును. అందుకు తగిన సమాధానము చెప్పగలము. సంస్కృత నాటకములందు సంస్కృత భాషతో పాటు ప్రాకృతభాష సైతము కలదుగదా! ఆ రెంటికిని ఉన్నంత వైలక్షణ్యము ఈ రెండింటికిని లేదు; గనుక, ఈ రెండుభాషలును జోడించుట అనుచితము కానేరదు.

నేటివరకును పెద్దనగారి ప్రబంధము శ్రవ్యకావ్యమగుట చేత దాని మాధుర్యము కొందరు మాత్రమే - వారైనను కొంతవరకు మాత్రమే-చవిచూడ గల్గినారు. ఇప్పు డిది

దృశ్యకావ్యముగా పరివర్తనముపొంది ప్రదర్శించుటకు యోగ్యమయినది గనుక ఆంధ్రులందరును పెద్దనగారి కవిత యందలి మాధుర్యమును ఆస్వాదించుటకు సాధ్యమయినది.

మనుచరిత్రములోని ఆరాశ్వాసములందునుగల కథల నెత్తుకొని కొందరు ఇదివరకు నాటకములు రచించినారు. కథావస్తువులో ఐక్యము, కాలపరిమితిలో ఒక నియమము లేని కథావళితో కూర్చిననాటకము యోగ్యమయినది కానేర దని తలచి, శ్రీ యువరాజుగారు వరూధినీ ప్రవరుల కథమాత్రమే ఎత్తుకొని ఈ నిరూపకము రచించినారు. ఈ నిరూపకము ప్రదర్శించినప్పుడు వీరుగావించిన రచనావిధానము హృద్యమైనదిగా ప్రేక్షకులుభావించి మెచ్చుకొందురని నా నమ్మకము.

ఈ ప్రస్తావన రచించుటకు నా కవకాశమిచ్చి నన్ను గౌరవించినందులకు శ్రీ యువరాజుగారికి నా కృతజ్ఞతాపూర్వక ధన్యవాదాలు. వీరికి సర్వేశ్వరుడు ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధుల నొసంగి వీరిచే నింకను ఎక్కువగా విద్యాపోషణము, సాహిత్యసేవ చేయించును గాక!

చెన్నపురి
25-11-1946

గిడుగు వేంకటసీతాపతి

(సూత్రధారుడగు పెద్దన్న ప్రవేశించును)

ఉయ్యాల మంచముపై ఆసీనుడై యుండును. ఒక దూతిక తాంబూల మిచ్చుచుండును. ఒక లేఖకుడు వ్రాయుచుండును.

(కండ్లు మూసికొని)

చ. నిరుపహతి స్థలంబు రమణీప్రియదూతిక తెచ్చి యిచ్చు క
ప్పురవిడె మాత్మ కింపయిన భోజన ముయ్యెలమంచ మొప్పు త
ప్పరయు రసజ్ఞు లూహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్
దొరకినఁ గాక యూరక కృతుల్ రచియింపు మనంగ శక్యమే.

ఓమ్

# వరూధినీ ప్రవరాఖ్యము

నాంది—

శ్రీ వక్షోజ కురంగనాభ మెదపైఁ జెన్నొంద విశ్వంభరా
దేవిన్ దత్కమలా సమీపమునఁ బ్రీతిన్ నిల్పినాఁడో యనం
గా వందారు సనందనాది నిజభక్తశ్రేణికిన్ దోఁచు రా
జీవాక్షుండు కృతార్థుఁజేయు శుభదృష్టిన్ గృష్ణరాయాధిపున్.

ఉ. ఉల్లమునందు నక్కటిక మూనుట మీ కులమందుఁ గంటి మం
చల్లన మేలమాడు నచలాత్మజ మాటకు లేఁతనవ్వు సం
ధిల్లఁ గిరీటిఁ బాశుపతదివ్యశరాఢ్యునిఁజేయు శాంబరీ
భిల్లుఁడు కృష్ణరాయల కభీష్టశుభప్రతిపాది గావుతన్.

ఉ. నాలుగు మోములన్ నిగమ నాదము లుప్పతిలన్ బ్రచండ వా
తూలహతిన్ జనించు రొదతోడి గుహావళి నొప్పు మేరువున్
బోలి పయోజపీఠి మునిముఖ్యులు గొల్వఁగ వాణిఁగూడి పే
రోలగ మున్నధాత విభవోజ్జ్వలుఁ జేయుతఁ గృష్ణరాయనిన్.

# వరూధినీ ప్రవరాఖ్యము

## ప్రదేశము - పెద్దనార్యుని గృహము

ఉ. అంకముఁజేరి శైలతనయా స్తనదుగ్ధము లానువేళ బా
ల్యాంక విచేష్టఁ దొండమున నవ్వలిచన్ గబళింపఁబోయి యా
వంకఁ గుచంబు గాన కహివల్లభహారము గాంచి వే మృణా
ళాంకుర శంక నంటెడు గజాస్యునిఁగొల్తు నభీష్ట సిద్ధికిన్.

సీ. చేర్పుచుక్కగా నిడ్డ చిన్ని జాబిల్లిచే
సెందూర తిలకంబు చెమ్మగిల్ల
నవతంస కుసుమంబునం దున్న యెలదేఁటి
రతి కించి దంచిత శ్రుతుల నీన
ఘనమైన రారాపు చనుదోయి రాయిడిఁ
దంబీపలంబు తుందుడుకుఁ జెందఁ
దరుణాంగుళిచ్ఛాయ దంతపు సరకట్టు
లింగిలికపు వింతరంగు లీన

తే. సుపనిషత్తులు బోటులై యోలగింపఁ
బుండరీకాసనమునఁ గూర్చుండి మదికి
నింపుసేయుచు వీణవాయించు చెలువ
పలుకురాణి మదాత్మలో వెలయుఁగాత.

(పెద్దన్న కండ్లు తెరచి) మధురమగు విద్యానిలయుడైన శఠకోప యతిని కొల్చుచున్నాను. సనకాశోపమునైన వాములూరు తనయుని, ద్వైపాయనుని, భట్టబాణుని, భానుని, భవభూతిని,

## వరూధినీ ప్రవరాఖ్యము

భారవిని, సుబంధుని, బిల్హణుని, కాళిదాసుని, మాఘుని, శివభద్రుని, మల్హణ కవిని, చోరుని, మురారిని, మయూరుని, సౌమిల్లిని, దండిని, నా వచశ్శుద్ధికొరకు ప్రస్తుతిస్తాను. వ్యాసరచిత భారతామ్నాయాన్ని ఆంధ్రభాషగ ఒనర్చిన నన్నపార్యుని, తిక్కనను, శంభుదాసుని భక్తితో తలుస్తాను.

మ. భరమైతోచు కుటుంబ రక్షణకుఁగాఁ బ్రాల్మాలి చింతన్ నిరం
తర తాళీదళ సంపుటప్రకర కాంతారంబునం దర్థపున్
దెరువాటుల్ దెగి కొట్టి తద్జ్ఞ పరిషద్విజ్ఞాత చౌర్య క్రియా
విరసుండై కొఱఁతన్ బడున్ గుకవి పృథ్వీభృ త్సమీప క్షితిన్.

నవీన కావ్య రచనానికి అనుకూలమైన కథలు ఏమి ఉన్నాయాఅని ఆలోచించు సమయాన్న,

సీ. ఉదయాచలేంద్రంబు మొదల నెవ్వని కుమా
రతకుఁ గ్రౌంచాచల రాజ మయ్యె
నానాడపతి శకంధర సింధురాధ్యక్షు
లరిగాపు లెవ్వాని ఖరతరాసి
కాపంచ గౌడ ధాత్రీపచం బెవ్వాని
కసివాఱుగా నేఁగునట్టి బయలు
సకలయాచకజనాశాపూర్తి కెవ్వాని
ఘనభుజాదండంబు కల్పశాఖి

తే. ప్రబల రాజాధిరాజవీరప్రతాప
రాజపరమేశ బిరుద విభ్రాజి యెవ్వఁ
డట్టి శ్రీకృష్ణదేవరాయాగ్రగణ్యుఁ
డొక్కనాఁడు కుతూహలం బుప్పతిల్ల.

సీ. ఇందీవరంబుల నీను క్రాల్గన్నుల
శరదిందు ముఖులు చామరము లిడఁగఁ
బణిసనూను కణాద బాదరాయణ సూత్ర
ఫక్కి విద్వాంసు లుపన్యసింపఁ
పార్శ్వభూమి నభీరుభటకదంబ కరాళ
హేతిచ్ఛటాచ్ఛాయ లిరులు కొనఁగ
సామంతమండనోద్దామమాణిక్యాంశు
మండలం బొలసి యీరెండ గాయ

తే. మూరురాయరగండపెండేరమణిమ
రీచిరింఛోళిఁ గలయ నావృతము లగుచు
నంకపాళి నటద్దుకూలాంచలములు
చిత్రమాంజిష్ఠవిభ్రమశ్రీ వహింప.

క. భువన విజయాఖ్య సంస
ద్భవనస్థిత భద్రపీఠిఁ బ్రాజ్ఞుల గోష్ఠిన్
గవితా మధురిమ డెందము
దవులఁగ గొలువుండి సదయతన్ ననుఁబల్కెన్.

తే. సప్త సంతానములలోఁ బ్రశస్తి గాంచి
ఖిలము గాకుండు నది ధాత్రిఁ గృతియ కానఁ
గృతి రచింపుము మాకు శిరీష కుసుమ
పేశల సుధామయోక్తులఁ బెద్ద నార్య.

క. హితుఁడవు చతుర వచోనిధి
వతుల పురాణాగమేతిహాస కథార్థ

వరూధినీ ప్రవరాఖ్యము

స్మృతియుతుఁడ వంద్రకవితా
పితామహుఁడ వెవ్వరీడు పేర్కొన నీకున్.

క. మనువులలో స్వారోచిష
మనుసంభవ మరయ రససమంచితకథలన్
విన నింపు కలిధ్వంసక
మనఘ, భవచ్చతుర రచన కనుకూలంబున్.

కావున మార్కండేయ పురాణోక్త ప్రకారాన చెప్పుమని కర్పూర తాంబూలము పెట్టగా పట్టి మహాప్రసాదం అని మోచమున సష్మహా ప్రబంధ నిబంధనానికి ప్రారంభిస్తున్నాను. ఇందులో నాకు ముఖ్యం ఐనది వరూధినీ ప్రవరాఖ్యుల రసవంతమైన గాథ. ఇంక ఏతత్ కథానాయకరత్నమగు ఆ మహీనాథుని వంశావతారము ఎట్టిది అంటే—

సీ. కలశ పాథోరాశి గర్భ వీచిమతల్లి
కడుపార నెవ్వాని గన్నతల్లి
యనలాక్ష ఘనజటా వనవాటి కెవ్వాఁడు
వన్నె వెట్టు నసార్తపంపుఁ బువ్వు
సకల దైవత బుభుక్షాపూర్తి కెవ్వాఁడు
పుట్టుగానని మేని మెట్ట పంట
కటికి చీఁకటితిండి కరముల గిలిగింత
నెవ్వాఁడు దొగకన్నె నవ్వఁజేసకు
తే. నతఁడు వొగడొందు మధుకైటభారి మఱఁది
కళల నెలవగు వాఁడు చుక్కలకు ఱేఁడు

# వరూధినీ ప్రవరాఖ్యము

మిసిమి పరసీమ వలరాజు మేనమామ
వేవెలుంగులదొరజోడు రేవెలుంగు.

ఆ సుధాధాముని విభవ మహాంబుధియందు ఉదయించిన బుధుడు, వానిపుత్రుడు పురూరవుడు ఆదిగా గల మహాధీమంతులు, వీర్యవంతులు అయిన తాత ముత్తాతల వంశాన నృసింహ ప్రభువు నకు నాగమాంబికకు అచ్యుతాంశ సంభవుడైన కృష్ణరాయ విభుడు ఉదయించినాడు.

సీ. తొలఁగెను ధూమకేతు క్షోభ జనులకు
నతివృష్టిదోష భయంబు వాసెఁ
గంటకాగమభీతి గడచె నుద్ధత భూమి
భృత్కూటకంబెల్ల నెత్తువడియె
మాసె నభస్స్ఫూర్తి మరుభూములందును
నెల మూఁడువానలు నిండఁగురిసె
నాబాల గోపాల మఖిల సద్ద్విజమును
నానందమున మన్కి నతిశయిల్లెఁ

తే. ప్రజల కెల్లను గడు రామరాజ్యమయ్యెఁ
జారు సత్త్వాభ్యుదయుఁ డీశ్వర నారసింహ
భూవిభుని కృష్ణరాయఁ డభ్యుదయ మొంది
పెంపు మీఱంగ ధాత్రిఁ బాలింపుచుండ.

ఆ మహావీరుని కత్తివాడిని, ఘంటంపు పదనులోను వికసించిన మహాప్రతాపం, అద్వితీయమైనధీశక్తి, దశదిశలుఆక్రమించినవి కదా!

మ. ధర కెంపూపులు కృష్ణరాయల చమూధాటీగతిన్ వింధ్య గ
హ్వరముల్ దూఱఁగఁ జూచి తారచటగాపై యుండుటన్ జాలన

చ్చెరువై యెఱ్ఱని వింతచీఁకటులు వచ్చెఁ జూడరే యంచు వే
సారిదిఁ జూతురు వీరరుద్ర గజరాట్ శుద్ధాంత ముగ్ధాంగనల్.

(ఆలోచించును) దేశభాషలందు తెలుగు లెస్స. ఆంధ్ర కవితా పితామహుడనైన అల్లసాని పెద్ద నార్యుండనైన నేను కృతి కర్తను. కరగని మహాస్థైర్యం చుట్టూ కరగించే మహాశృంగారంయొక్క ఘోష నాకృతికన్యయొక్క శిరోభూషణం. ఆవిష్కృతకీర్తిఫవళితా శాంతుడైన కృష్ణదేవరాయలు కృతిభర్త ! ఓహో ! చూపిస్తా ! మా ప్రతాపము !

క. అవిరళ వితరణ విద్యా
నవధాధేయునకు సజ్జన విధేయునకుఁ
గవితాస్త్రీలోలునకుఁ
ఖవిటంకనటద్యశోబ్ధి కల్లోలునకుఁ.

అభ్యుదయ పరంపరాభివృద్ధిగ నే నొనర్పంబూనిన స్వారోచిష మనుసంభవంబను మహాప్రబంధమునకు కథాక్రమ మెట్టిదనిన.

(తెరపడును)

# వరూధినీ ప్రవరాఖ్యము

---

## ప్రథమాంకము

ప్రదేశము : అరుణాస్పదపురములో ప్రవరుని
గృహములో ఒక ప్రదేశము.

ప్రవేశము : ఇద్దరు వటువులు పఠన గ్రంథాలతో
కూర్చొని యుందురు.

---

1 వటువు—ఈ మధ్య మహాత్ము లెవరూ మన గురువుగారైన ప్రవరుని దగ్గరకు వచ్చినట్లు లేదే ?

2 వటువు—ఎప్పుడూ అతిథులు వస్తూయుండే ఈ యింటికి మహాత్ములు ఎవరూ రాలేదని ఎలా చెప్పగలవు ?

1 వటువు—అదే నా మాహాత్మ్యము.

2 వటువు—ఏడ్చినట్లే యున్నది. కాని మహాత్ములు ఎవరూ రాలేదని చెప్పడానికి కారణము నిజంగా చెప్పు.

1 వటువు—ఓరి వెట్టివాడా ! మహాత్ము లెవరైనా వస్తే ఆనాడుమనకు అనధ్యయనము కాదటరా ?

2 వటువు—చాలా బాగా కనిపెట్టినావు.

1 వటువు—నీవు మన గురువుగారిలాగున ప్రపంచగొడవే తెలియని శ్రోత్రియ డింభకుడవురా.

2 వటువు—ఏమీ ! మన గురువుగారు ఏమైనా తక్కువ వారు అను

కున్నావా ? సామాన్యు లనుకున్నావా ? చాలా గొప్పవారని తెలియదూ?

1 వటువు—ఇచట అందరూ గొప్పవాళ్లే!

2 వటువు—ఎం చేత ?

1 వటువు—ఎం చేతా ? విను. ఒకడు ఏమన్నాడో——

సీ. అచటివిప్రులు మెచ్చ రఖిలవిద్యాప్రౌఢి
ముది మది దప్పిన మొదటివేల్పు
నచటిరాజులు బంటు నంపి భార్గవునైన
బింకానఁ బిలిపింతు రంకమునకు
నచటిమేటికిరాటు లలకాధిపతి నైన
మును సంచిమొద లిచ్చి మనుప దక్షు
లచటినాలవజాతి హాలముఖాత్తవిభూతి
నాదిభిక్షువు భైక్ష మైన మాన్చు

తే. నచటివెలయాండ్రు రంభాదు లైన నొరయఁ
గాసెకొంగున వారించి కడపఁగలరు
నాట్యరేఖాకళాధురంధరనిరూఢి
నచటఁ బుట్టిన చిగురుఁగొమ్మైనఁ జేవ.

2 వటువు—అలాగైనా అందరినీ మించినవాడు కాడా మన గురువూ ?

1 వటువు—నా కా మాత్రము తెలియ దనుకొన్నావా?

ఉ. ఆపురిఁ బాయకుండు మకరాంకశశాంకమనోజ్ఞమూర్తి భా
షాపరశేషభోగి వివిధాధ్వరనిర్మలధర్మకర్మదీ
క్షాపరతంత్రుఁ డంబురుహగర్భకులాభరణం బనారతా
ధ్యాపనతత్పరుండు ప్రవరాఖ్యుఁ డలేఖ్యతనూవిలాసుఁడై.

ఆ. వాని చక్కఁదనము వైరాగ్యమునఁ జేసి
కాంక్షసేయు జారకామినులకు
భోగబాహ్య మయ్యెఁ బూచిన సంపెంగ
పొలుపు మధుకరాంగ నలకుఁ బోలె.

2 వటువు—ఏమిటోయ్! నీకు శృంగారముమీద పోవుచున్నది.

1 వటువు—వయస్సురా. నిజం చెప్పొద్దు. కామశాస్త్రం మీదనున్న అభిరుచి గాయిత్రిమీద లేదు.

2 వటువు—ఈ మాట్లకేం కాని, గురువుగారి కాపురం, చర్య, ఆయన యిల్లాలి సౌశీల్యము, గృహిణీ ధర్మంయొక్క నిర్వహణం, ఉత్తమమైన వారి అన్యోన్యానురాగం చూస్తే ఎంతో ఆదర్శప్రాయంగా ఉంటుంది.

ఉ. యౌవనమందు యజ్వయు, ధనాఢ్యుఁడు నై కమనీయకౌతుక
శ్రీవిధిఁ గూఁకటుల్ గొలిచి చేసిన కూరిమి సోమిదమ్మ సౌ
ఖ్యాపహయై భజింప సుఖులై తలిదండ్రులు గూడి దేవియుం
దేవరవోలె నుండి యిలుదీర్పఁగఁ గాపుర మొప్పు వానికిన్.

సీ. వరణాతరంగిణీదరవికస్వరనూత్న
కమలకషాయగంధము వహించి
ప్రత్యూషపవనాంకురములు పైకొనువేళ
వామనస్తుతిపరత్వమున లేచి
సచ్ఛాత్త్రుఁ డగుచు నిచ్చలు నేఁగి యయ్యేట
నఘమర్షణస్నాన మాచరించి
సాంధ్యకృత్యముఁ దీర్చి సావిత్త్రి జపియించి
సైకతస్థలిఁ గర్మసాక్షి కెఱఁగి

తే. ఫలసమిత్కుశకుసుమాది బహుపదార్థ
తతియు నుదికిన మడుఁగు దోవతులుఁ గొంచు
బ్రహ్మచారులు వెంట రా బ్రాహ్మణుండు
వచ్చు నింటికిఁ బ్రజ దన్ను మెచ్చి చూడ.

శా. శీలంబున్ గులమున్ శమంబు దమమున్ జెల్వంబు లేఁబ్రాయ
మున్, బోలన్ జూచి యితండె పాత్రుఁ డని యే భూపాలుఁ డీ
వచ్చినన్, సాలగ్రామము మున్నుగాఁ గొనఁడు మాన్యక్షేత్ర
ముల్ పెక్కు చం, దాలన్ బండు నొకప్పుడున్ దఱుఁగ దింటన్
బాడియున్ బంటయున్.

తే. వండ నలయదు వేవురు వచ్చిరేని
నన్నపూర్ణకు నుద్దియౌ నతని గృహిణి
నతిథు లేతేర నడికిరేయైనఁ బెట్టు
పలయు భోజ్యంబు లింట నవ్వారి గాఁగ.

సీ. తీర్థసంవాసు లేతెంచినా రని విన్న
నెదురుగా నేఁగు దవ్వెంత యైన
నేఁగి తత్పదముల కెఱఁగి యింటికిఁ దెచ్చుఁ
దెచ్చి సద్భక్తి నాతిథ్య మిచ్చు
నిచ్చి యిష్టాన్న సంతృప్తులఁగాఁ జేయుఁ
జేసి కూర్చున్నచోఁ జేరవచ్చు
వచ్చి యిద్ధరఁగల్గు వనధిపర్వతసరి
త్తీర్థమాహాత్మ్యముల్ దెలియ నడుగు

తే. నడిగి యోజనపరిమాణ మరయు నరసి
పోవలయుఁ జూడ ననుచు నూర్పులు నిగుడ్చు

ప్రథమాంకము

ననుదినము తీర్థసందర్శనాభిలాష
మాత్మ నుప్పొంగ నత్తరుణాగ్నిహోత్రి.

(ప్రవరుడు లోపలనుంచి ప్రవేశించును - శిష్యులు లేచి నమస్కరింతురు)

ప్రవరుడు—చిరంజీవ ! చిరంజీవ ! నిన్నరాని పాఠాలు ఈ వేళ వచ్చినవా ?

1 వటువు—చిత్తము. కొంతవరకు.

2 వటువు—చిత్తము. చాలావరకు.

ప్రవ—మీరు అనవసరమైన విషయాలు విడచిపెట్టి పాఠాల మీద శ్రద్ధ యుంచితే ఏ విధమైన కష్టమూ ఉండదు.

శిష్యులు—చిత్తము, చిత్తము.

ప్రవ—(వీధివైపు చూచి) ఆహా ! ఎవరో యొకరు పరమయోగీంద్రులు ఈ ప్రాంతాలకు దయచేయుచున్నట్లున్నారు. అవును అప్పుడే మన కెదురుగానున్న యింటిని సమీపించుచున్నారు.

సీ. ముడిచిన యొంటి కెంజడ మూయ మువ్వన్నె
మెగముతోలు కిరీటముగ ధరించి
కకపాలకేదారకటకముద్రితపాణిఁ
గుఱుచలాఠాముతోఁ గూర్చి పట్టి
హైణేయమైన యొడ్డాణంబులవణిచే
నక్కళించినపొట్ట మక్కళించి
యారకూటచ్ఛాయ నవఘళింపఁగజాలు
బడుగు దేహంబున భస్మమలఁది

తే. మిట్టయురమున నిడు యోగపట్టె మెఱయఁ
జెవుల రుద్రాక్ష పోఁగులు చవుకళింపఁ
గావికుబుసంబు జలకుండికయును బూని
చేరెఁ దద్గేహ మౌషధసిద్ధుఁ డొకఁడు.

అదిగో మన గృహానికే దయచేస్తున్నారు.

(ప్రవరు డెదురేగ పరమయోగీంద్రుడు ప్రవేశించును. ప్రవరుడు వానికి నమస్కరించి, శిష్యులు వెళ్లి తెచ్చిన సామగ్రితో ఆయనకు అర్ఘ్యపాద్యాలు యిచ్చును).

ధన్యుణ్ణి, ధన్యుణ్ణి. ఇదియొక పుణ్యదినము. దయచేయండి మహాత్మా!

(కూర్చుండ బెట్టును. శిష్యులు నమస్కరింతురు. సిద్ధుడు ప్రవరుని శిష్యులను చేతితో ఆశీర్వదించును)

ప్రవ—మహాత్మా! తమరు చాలా అలసి యుంటారు. మేము భక్తితో యిచ్చే తమకు యోగ్యమైన ఆహారాన్ని భుజించి మమ్ములను ధన్యుల్ని చేయాలి.

(లోపలికి వెళ్లి భార్యా సహితుడై కందమూల ఫలాదులు తీసికొని రాగా మరల ప్రవేశించును. ఆ యిల్లాలు సిద్ధుని ఎదుట ఆహారమునుంచి ఆయనకు నమస్కరించగా సిద్ధుడు ఆమెను దీవించును. సిద్ధుడు భుజించిన తరువాత అతనికి మరల నమస్కరించి ఆ యిల్లాలు అక్కడనున్న సామగ్రితో లోపలికి నిష్క్రమించును)

ప్రవ—(వటులను చూచి) మహాత్ములు వచ్చారు గనుక ఈ నాడు అనధ్యయనము మీకు.

## ప్రథమాంకము

వటువులు—(గురువునకు నమస్కరించి వెళ్లుదురు; వెళ్లునప్పుడు ఒకరితో నొకరు సంతోషముతో)

శిష్టానధ్యయనము, శిష్టానధ్యయనము.

ప్రవ—(కూర్చుండి)

క. ఎందుండి ఎందుఁబోవుచు
నిందులకేతెంచినార లిప్పుడు విద్వ
ద్వందిత నేఁడుగదా మ
న్మందిరము పవిత్రమయ్యె మాన్యుఁడ నైతిన్.

క. మీ మాటలు మంత్రంబులు
మీ మెట్టిన యెడ ప్రయాగ మీ పాదపవి
త్రామలతోయము లలఘు
ద్యోమార్గధురాంబు పౌనరుక్త్యము లుర్విన్.

ఉ. వానిది భాగ్యవైభవము వానిది పుణ్యవిశేష మెమ్మెయిఁ
వాని దవంధ్యజీవనము వానిది జన్మము వేయు నేయ కె
వ్వాని గృహాంతరంబున భవాదృశయోగిజనంబు పావన
స్నానవిధాన్నపానముల సంతస మందుచుఁ బోవు నిచ్చలున్.

తే. మౌనినాథ, కుటుంబజంబాలపటల
మగ్నమాదృశగృహమేధిమండలంబు
నుద్ధరింపంగ నౌషధ మొండు గలదె
యుష్మదంఘ్రిరజోలేశ మొకటి దక్క.

సిద్ధుడు—వత్సా! మా వంటి తైర్థికావళికి మీవంటి గృహస్థుల సుఖ జీవనమువలనకదా తీర్థసేవ సాధ్యమగును?

వరూధినీ ప్రవరాఖ్యము

సీ. కెలఁకుల నున్న తంగేటిజున్ను గృహమేధి
యజమానుఁ డంకస్థితార్థపేటి
పండినపెరటికల్పకము వాస్తవ్యుండు
దొడ్డిఁ బెట్టిన వేల్పు గిడ్డికాఁపు
కడలేని యమృతంపునడబావి సంసారి
సవిధమేరునగంబు భవనభర్త
మరుదేశపథమధ్యమప్రప కులపతి
యాఁకటి కొందవు సస్యము కుటుంబి

తే. బధిర పంగ్వంధ భిక్షుక బ్రహ్మచారి
జటి పరివ్రాజ కాతిథి క్షపణ కావ
ధూత కాపాలికా ద్యనాథులకుఁ గాన
భూసురోత్తమ, గార్హస్థ్యమునకు సరియె.

ప్రవ—దేవా! దేవర యిలపై సమస్త తీర్థాటనము కావించు చుందురు; కాబట్టి విభజించి అడుగాలని కౌతుకం అయింది.

శా. ఏయే దేశములన్ వసించితిరి మీ రేయే గిరుల్ చూచినా
రేయే తీర్థములందుఁ గ్రుంకిడితి రేయే ద్వీపముల్ మెట్టినా
రేయే పుణ్యవనాళిఁ ద్రిమ్మరితి రేయే తోయధుల్ డాసినా
రాయా చోటులఁ గల్గు వింతలు మహాత్మా నాకెఱింగింపరే.

పోయి సేవింపలేకున్నా పుణ్యతీర్థమహిమ వినటంకూడా అఖిల కల్మషహారం కాబట్టి తమరిని ఈ విధంగా వేడుచున్నాను.

సిద్ధుడు—(ఆదరంతో)

ఉ. ఓ చతురాస్యవంశకలశోదధిపూర్ణశశాంక, తీర్థయా
త్రాచణశీలినై జనపదంబులుఁ బుణ్యనదీనదంబులున్

జూచితి నందునందుఁగల చోద్యములుఁ గనుఁగొంటి నాపటీ
రాచల పశ్చిమాచల హిమాచల పూర్వదిశాచలంబులన్.

శా. కేదారేశు భజించితిన్ శిరమునన్ గీలించితిన్ హింగుళా
పాదాంభోరుహముల్ ప్రయాగనిలయుం బద్మాక్షు సేవించితిన్
యాదోనాథసుతాకళత్రు బదరీనారాయణున్ గంటి నీ
యాదేశం బన నేల చూచితి సమస్తాశావకాశంబులన్.

ఓ గృహస్థరత్నమా! విను. అదేకాక, లంబమానరవిరథ తురంగశృంగారచారుచామరచ్ఛటాప్రేక్షణక్షణోద్గ్రీవచమర సముద యము అగు ఉదయమున కల విశేషములు శేషఫణికినైనా లెక్కింప శక్యమా! ఇది మలయమునగల చలువకు విలువ యేదీ! మరి అస్తమునఁగల మణిప్రస్తరముల విశ్రాంతిని చింతించిన మేనను పులకలు ఇప్పుడునూ పొడమెడు. ఇంక రజతశైలంబు నోలంబు లను కాలగళవిహారప్రదేశములనుగన్న సంసృతిక్లేశములు వాయవే! మరి మేరుధరాధరంబు శిఖరముల సోయగములు కలయ గనుంగొనుట బహుజన్మకృతసుకృతపరిపాకమున గాక ఏల చేకూర నేర్చును? నే నిట్టిమహాద్భుతములను ఈశ్వరానుగ్రహాన అల్ప కాలములో కనుగొన్నాను.

ప్రవ—(చిరునగవుతో)

చ. తెలివక మీ కొనర్తు నొక విన్నప మిట్టివి యెల్లఁ జూచి రా
నెఱకలుగట్టుకొన్న మఱియేండ్లును బూండ్లునుబట్టుఁ బ్రాయపుం
జిఱుతతనంబు మీ మొగము సెప్పక చెప్పెడు నద్దిరయ్య మా
కెఱుఁగఁదరంబె మీమహిమ లీర యెఱుంగుదు రేమి చెప్పుదున్.

సిద్ధుడు—తెలియగోరుట తప్పేమి? గృహపతీ! విను. మేము సిద్ధుల మగుటచేత జరారుజలు మమ్ము తాకుటకు వెరచును.

వరూధినీ ప్రవరాఖ్యము

మ. పరమంబైన రహస్యమౌనయిన దాఁపన్ జెప్పెదన్ భూమి ని
ర్జరవంశోత్తమ పాదలేప మను పేరన్ గల్గు దివ్యౌషధం
పురసం బీశ్వరసత్కృపన్ గలిగెఁ దద్భూరిప్రభావంబునన్
జరియింతున్ బవమానమానసతిరస్కారిత్వరాహంకృతిన్.

క. దివి బిసరుహబాంధవసైం
ధవసంఘం బెంతదవ్వు దగలే కరుగున్
భువి నంత దవ్వు నేమును
రవరవ లే కరుగుదుము హుటాహుటి నడలన్.

ప్రవ—(నమస్కరించి) ఓ మునిలోకగ్రామణీ! మీ దివ్య ప్రభావము ఎరుగని నా ప్రల్లదాలు సహించి దయతో మీ శిష్యుడనైన నన్ను తీర్థయాత్రవలన ధన్యాత్మునిగా చేయరా?

సిద్ధుడు—(తన పేపబుట్టలోని దంతపుబరణి తెరచి, ఒక పసరుతీసి ప్రవరుని పాదాలకు పూయును.)

ప్రవ—మహాభాగ్యము; మహాభాగ్యము. (సిద్ధునకు వంగి నమస్కరించును).

సిద్ధుడు—(ఆశీర్వదించి లేచి) సెలవు.

(ప్రవరుడు సిద్ధుని బయటకు సాగనంపును)

(తెరపడును)

(తెర లో)

శా. గంగాస్వచ్ఛతరంగభంగికయశోగాఢచ్ఛవిచ్ఛన్న సా
రంగాంకాంకనిరంకుశప్రతికళాప్రౌఢిప్రియంభావుకా
గాంగేయాచలచాపనూపురవచోగాంభీర్యలీలాస్పదా
బంగాళాంగకళింగభూపసుభటాభ్రశ్రేణిఝంఝానిలా.

---

# వరూధినీ ప్రవరాఖ్యము

## ద్వితీయాంకము

### రంగము ౧

ప్రదేశము: హిమాలయపర్వత ప్రదేశము.

ప్రవేశము: ప్రవరుడు.

ప్రవ—ఆహా! రసప్రభావముచేత ఒక్క త్రుటికాలంలో ఈ హిమాలయాలను చేరగల్గేను. ఎక్కడి అరుణాస్పదము! ఎక్కడి హిమాలయము! శుద్ధశ్రోత్రియుణ్ణి నేను యిక్కడికివచ్చి ఈ మహానగాన్ని దర్శింప గలుగటమా! నేను మహాదృష్టవంతుణ్ణి. (సంతోషముతో)

చ. అటఁ జని కాంచె భూమిసురుఁ డంబరచుంబిశిరస్సరజ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠదభంగతరంగమృదంగనిస్వన
స్ఫుటనటనానురూపపరిఫుల్లకలాపకలాపిజాలముం
గటకచరత్కరేణుకరకంపితసాలము శీతశైలమున్.

(సౌందర్యగ్రహణము చేసి)

నరనారాయణచరణాంబురుహద్వయభద్రచిహ్న ముద్రితమైన ఈ బదరీతరుషండమండలాంతరసరణిని వెళ్లెదను. (నడచి) ఆహా!

క. ఉల్లలదలకాజలకణ
పల్లవితకదంబముకుళపరిమళలహరీ

వరూధినీ ప్రవరాఖ్యము

హల్లోహలమదబంభర
మల్లధ్వను లెసగ విసరె మరుదంకురముల్.

అదిగో; ఏమిదృశ్యం !

సీ. తొండము ల్సాఁచి యందుగుఁ జిగుళ్లకు నిక్కు-
కరుల దంతచ్ఛాయ గడలు కొనఁగ
సెలవుల వనదంశములు మూఁగి నెటెవెట్టఁ
గ్రోల్పులఁల్ పొదరిండ్ల గుఱక లిడగ
సెలయేటి యిసుకలంకల వరాహంబులు
మొత్తంబులై త్రవ్వి ముస్తె లెత్త
నడ్డంబు నిడుపు నాపడ్డలగతి మను
బిళ్లు డొంకలనుండి క్రేళ్లు దాఁటఁ

తే. ప్రబలభల్లుకనఖభల్లభయదమథన
శిథిలమధుకోశవిసరవిశీర్ణ మక్షి
కాంతరాంతరదంతురితాతపమున
బుడమి తిలతండులన్యాయమున వెలుంగ.

భయానకంగా ఉన్నది. అయినా జాగ్రత్తగా ఇచ్చటి తరుగహన గుహలను విహరించి చూడాలి. ప్రకృతి ఎంతో రమణీయంగా ఉన్నది. (విహరించుచు) ఆహా! ఎంత పవిత్రభూమి యిది !

సీ. నిడుద పెన్నెఱిగుంపు జడగట్ట సగరు ము
మ్మనుమండు తపము గై కొనిన చోటు
జరఠకచ్ఛపకులేశ్వరు వెన్నుగాన రా
జగతికి మిన్నేఱు దిగిన చోటు

పుచ్చడీకతనంబు పోఁబెట్టి గిరికన్య
పతి గొల్వ నాయాసపడిన చోటు
వలరాచరాచవాఁ డలికాక్షు కనువెచ్చఁ
గరఁగిన యల కనికరపుఁ జోటు
తే. తపసి యిల్లాండ్ర చెలువంబు దలఁచి తలఁచి
మున్ను ముచ్చిచ్చును విరాళి గొన్నచోటు
కనుపపులు వేల్పుఁ బడవాలు గన్నచోటు
కాంచినాడను కన్నుల కరవుతీర.

వ. విలయకృశానుకీలముల వేఁడిమిఁ బోడిమి మాలివెల్మిడిన్
గలసిన భూతధాత్రి మతిక్రమ్మఱరూపయి నిల్చి యోషధుల్
మొలవఁగఁ జేయునట్టి నయమున్ ప్రతికల్పము నెట్లు గాంచునీ
చలిమలవల్ల నుల్లసిలు చల్లఁదనంబును నూనకుండినన్.

సీ. పసుపు నిగ్గులు దేఱు పాఁప జన్నిద మొప్పఁ
బ్రమథాధిపతి యింటిప ట్టెఱింగె
శచికీఁత గఱపుచు జదలేటి సురరాజు
జలకేళి సవరించు చెలు వెఱింగె
నదను తోఁజేఁపి చ న్నవిసి యోషధుల మ
న్నొ్మదపు కొండలకెల్లఁ బిదుక నెఱిఁగె
వేల్పు టింతులలోన విఱ్ఱవీఁగుచు మేన
నవరత్నరచనల రవణ మెఱిఁగెఁ
తే. బరిపరి విధంపు జన్నంపుఁ బరికరంపు
సొంపుసంపద నిఖిల నిలింపసభయు
నప్పటప్పటికిని జిహ్వా తృప్పుడుల్ల
నామెత లెఱింగె నీతుషారాద్రి కతన.

మ. తలమే బ్రహ్మకునైన నీ నగమహత్త్వం బెన్న నేనియ్యెడన్
గల చోద్యంబులు జేపు గగ్గానియెదన్ గాకేమి నేఁడేఁగెదన్
నలినీబాంధవభానుతప్తరవికాంతస్యందినీహారకం
దళచూత్కారపరంపరల్ పయిపయిన్ మధ్యాహ్నముల్ దెల్పెడిన్,

ఆలస్యమై పోవుచున్నది. నేను ఇంక తిరిగి అరుణాస్పదం వెళ్లి పోవాలి. (యత్నించును) అయ్యో! ఇదేమిటి! ఎగరలే కున్నాను. (ఆలోచించి పాదాలు తాకి) అయ్యో! మంచునీటివలన నా పాద లేపం కరగిపోయింది! హా దైవమా! సిద్ధాపదేశాన నన్ను ఈ ఘోరవనప్రదేశానికి తెచ్చావా!

క. ఎక్కడి యరుణాస్పదపుర
మెక్కడి తుహినాద్రి క్రొవ్వి యే రాఁదగునే
యక్కట మును సనుదెంచిన
దిక్కిదియని యెఱుఁగ వెడలు తెరు వెయ్యదియో.

మ. అకలంకౌషధసత్త్వమున్ దెలియ మాయాద్వారకావంతి కా
శి కురుక్షేత్రగయా ప్రయాగములు నే సేవింప కుద్దండ గం
డక వేదండవరాహవాహరిపుఖడ్గవ్యాఘ్ర మిమ్మంచుఁగొం
డకు రా జెల్లునె బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్.

సీ. నను నిముసంబు గానక యున్న నూరెల్ల
నరయు మజ్జనకుఁ డెంత తడలు నొక్కొ
యెపుడు సంధ్యలయందు నిలువెళ్లనీక న
న్నోమెడు తల్లి యెంతొ అలు నొక్కొ
యనుకూలవతి నాదు మనసులో వర్తించు
కులకాంత మదినెంత కుందునొక్కొ

గెడఁదోఁపనీడలై క్రీడించు సచ్ఛాత్రు
లింతకునెంత చింతింతురొక్కొ

తే. యతిథి సంతర్పణంబు లేమయ్యెనొక్కొ
యగ్ని లేమయ్యె నొక్కొ నిత్యంబులైన
కృత్యములఁ బాపి దైవంబ కీనుక నిట్లు
పాఱవైచితె మిన్నులు పడ్డచోట.

నాకు యిల్లుచేరే ఉపాయము చూపించే సుకృతి ఎవరైనా ఒకరు కనిపించరా?

(నడచును - నిష్క్రమించును)

---

రంగము ౨

ప్రదేశము: అత్యంత సుందరమైన భూమి. మామిడిచెట్లు పోకచెట్లుకూడ నుండును.

(వరూధిని గరుడపచ్చలు పొదుగబడిన తన యింటిముంగిటనున్న మావిగున్న యెదుట వితర్దిపై కూరుచుండి వీణవాయించుచుండును. చెలికత్తె ఒక పొదచాటున పరుండియుండును)

వరూధిని—ఎవ్వడో ఒక మనుష్యుడు - వేషాన్నిబట్టి భూసురుడు లాగున్నాడు. దేనినో పరీక్షించుచున్నాడు.

సీ. కులిశధారాహతి పొలుపునఁ బైనుండి
యడుగు మోవఁగ జేగుఱైన తటులఁ
గనుపట్టులోయ గంగానిర్ఝరము వాఱఁ
జలువయౌ నయ్యేటి కెలఁకులందు

వరూథినీ ప్రవరాఖ్యము

నిసుకవెట్టిన నేలనేచి యర్కాంశులఁ
జొరనీక దట్టమై యిరులు గవియు
క్రముకపున్నాగ నారంగరంభానాళి
కేరాది విటపికాంతారవీథిఁ

తే. గెరలు పికశారికా కీరకేకి భృంగ
సారస ధ్వనిఁదనలోని చంద్రకాంత
దరలు ప్రతిశబ్దమీన గంధర్వయక్ష
గాన ఘూర్ణిత మగునొక్క కోనఁగనియె.

( తెర లో )

ప్రవ—ఇది యొక మునియాశ్రమము కావచ్చును, ఇక్కడకు
వెళ్లితే నాకు ఏదైనా ఉపాయము దొరకవచ్చును.

చెలికత్తె—

చ. నికటమహీధరాగ్రతటనిర్గతనిర్ఝరధారఁ బాసి లో
యకుఁ దలక్రిందుగా మలఁకలై దిగు కాలువవెంటఁ బూచు మ
ల్లిక లవలంబనంబుగ నలిప్రకరధ్వని చిమ్మిరేఁగ లో
నికి మణిపట్టభంగసరణిన్ ధరణీసురు డేఁగి చెంగటన్ .

(ఆమె చదువుచుండగ ప్రవరుడు ప్రవేశించును)

..................ఏదో చూస్తున్నాడు.

ప్రవరుడు—

శా. తావుల్ క్రేవలఁ జల్లు చెంగలువ కేదారంబు తీరంబునన్
మావుల్ క్రోవులు నల్లిబిల్లిగొను కాంతారంబునం దైందవ
గ్రావాకల్పితకాయమాన జటిలద్రాక్షాగుళుచ్ఛంబులన్
బూవుందీవెలనొప్పునొక్కభవనంబున్గారుడోత్కీర్ణమున్.

....భాగ్యవశాన కనుగొన్నాను. ఆహా! ఏమి సౌభాగ్యము!

(కొంచెము సమీపించి)

క. మృగమదసౌరభవిభవ
ద్విగుణితఘనసారసాంద్రవీటీగంధ
స్థగితేతరపరిమళమై
మగువ పొలుపు దెలుపు నొక్క మారుత మొలసెన్.

ఇక్కడ ఎవరో ఉన్నట్టున్నారు. (వరూధిని యున్నచోటు సమీపించును.)

చెలికత్తె—

మ. అతఁడా వాతపరంపరాపరిమళవ్యాపారలీలన్ జనా
న్వితమిచ్చో టని చేరఁబోయి కనియెన్ విద్యుల్లతావిగ్రహన్
శతపత్రేక్షణఁ జంచరీకచికురన్ జంద్రాస్యఁ జక్రస్తనిన్
నతనాభిన్ నవలా నొకానొక మరున్నారీశిరోరత్నమున్.

ఆ మరున్నారీ శిరోరత్నము నా అమ్మగారుగాక యింకెవ్వరు? ఆమె చూడకుండా సంగతులు కనిపెట్టాలి.

ప్రవ—(ఆమెను కాంచి సందేహించుచుండును).

చెలికత్తె—

తే. అమలమణిమయనిజమందిరాంగణస్థ
తరుణసహకారమూలవితర్దిమీఁద
శీతలానిల మొలయ నాసీనయైన
యన్నిలింపాబ్జముఖియు నయ్యవసరమున;

సీ. తతనితంబాభోగధవళాంశుకములోని
యంగదట్టపుఁ గావిరంగువలన

వరూధినీ ప్రవరాఖ్యము

శశికాంతమణిపీఠి జాజువాఱఁగఁగాయ
ఉత్తుంగ కుచపాళి నత్తమిల్లఁ
దరుణాంగుళీధూత తంత్రీస్వనంబుతో
జిలిబిలి పాట ముద్దులు నటింప
నాలాపగతిఁ జొక్కి యరమోడ్పుఁగనుదోయి
రతిపారవశ్యవిభ్రమముఁ దెలుపఁ

తే. ప్రౌఢిఁ బలికించు గీతప్రబంధములకు
గమ్రకరపంకరుహరత్నకటకఝుణఝు
ణ ధ్వనిస్ఫూర్తి తాళమానములు గొలుప
నింపుదళుకొత్త వీణ వాయింపుచుండి.

(ఈ తరువాత వచ్చు ఆరు పద్యములకు అనుగుణంగా వరూధిని నటించుచుండును).

ఉ. అబ్బురపాటుతోడ నయనాంబుజముల్ వికసింపఁ గాంతి పె
ల్లుబ్బి కనీనికల్ వికసితోత్పలపంక్తులఁ గ్రుమ్మరింపఁగా
గుబ్బమెఱుంగుఁ జన్గవ గగుర్పొడువన్ మదిలోనఁ గోరికల్
గుబ్బటిలంగఁ జూచె నలకూబరసన్నిభు నద్ధరామరున్.

ఉ. చూచి, ఝళంఝళత్కటకసూచితవేగపదారవిందయై
లేచి కుచంబులున్ దుఱుము లేనడు మల్లలనాడ నయ్యెడన్
బూచినయొక్క పోఁకనును బోదియఁ జేరి విలోకనప్రభా
వీచికలన్ దదీయపదవీకలశాంబుధి వెల్లిగొల్పుచున్.

మ. మునుమున్ పుట్టెడు కొంకుకౌల్యము నిడన్మోదంబు విస్తీర్ణ
తన్, జొనుపన్ గోర్కులు గ్రేళ్లుద్రిప్ప మది మెచ్చుల్ తెప్ప

లల్లార్పన, త్యనుషంగస్థితి టెచ్చపాటొసఁగ సౌయ్యారంబునన్
జంద్రికల్, దనురక్తి జూచె లతాంగి భూసురుఁ బ్రఫుల్లనేత్ర
పద్మంబులన్.

క. పంకజముఖి కప్పుడు మై
నంకురితములయ్యెఁ బులకలావిష్కృతమీ
నాంకానలసూచక ధూ
మాంకురములుఁబోలె మఱియు నతనిన్ జూడన్.

ఉ. తొంగలి ఱెప్పలన్ దొలఁగఁద్రోయుచు బైపయి విస్తరిల్లు క
న్నుంగవ యాక్రమించుకొనునో ముఖచంద్రు నటంచుఁబోవనీ
కంగటుఁ దానవెట్టి కదియన్ గుఱివ్రాసెననంగ జాఱి సా
రంగమదంబు లేఁజెమటఁ గ్రమ్మె లలాటము డిగ్గి చెక్కులన్.

మ. అనిమేషస్థితి మాన్పె చిత్తరపుఁ జూ పస్వేదతావృత్తి మా
న్పె నవస్వేద సమృద్ధి బోధకళమాన్పెన్ మోహవిభ్రాంతి తో
డనె గీర్వాణవధూటికిన్ భ్రమరకీటన్యాయమొప్పన్ మను
ష్యుని భావించుట మానుషత్వముమెయిన్ జూపట్టె నా సత్తఱిన్.

వరూధిని—ఆహా! ఏమి రూపరేఖా విలాసాలు!

ఉ. ఎక్కడివాఁడొ యక్షతనయేందుజయంతవసంతకంతులన్
జక్కఁదనంబునన్ గెలువఁజాలెడువాఁడు మహీసురాన్వయం
బెక్కడ యీతనూవిభవ మెక్కడ యేలని బంటుగా మరున్
దక్కఁగొనంగరాదె యకటా నను వీఁడు పరిగ్రహించినన్.

సీ. వదనప్రభూతలావణ్యాంబుసంభూత
కమలంబు లన వీని కన్ను లమరు

వరూధినీ ప్రవరాఖ్యము

నిక్కపీనులతోడ నెక్క సక్కెములాడు
కరణి నున్నవి వీని ఘనభుజములు
సంకల్పసంభవాస్థానపీఠికవోలె
వెడఁదయై కనుపట్టు వీనియురము
ప్రతిఘటించు చిగుళ్లపై నెట్టివాటిన
రీతి నున్నవి వీని మృదుపదములు

తే. నేరె మేటియసల్ తెచ్చి నీరజాప్త
సానఁబట్టిన రాపొడి చల్లి మెదిపి
పదను సుధ నిడి చేసెనో పద్మభవుఁడు
వీనిఁగాకున్నఁగలదె యీ మేనికాంతి.

క. సురగరుడోరగనరఖే
చరకిన్నరసిద్ధసాధ్యచారణవిద్యా
ధరగంధర్వకుమారుల
నిరతము గనుఁగొనమె పోల నేర్తురె వీనిన్.

చెలికత్తె—

మ. అని చింతించుచు మీనకేతనధనుర్జ్యాముక్తనారాచ దు
ర్దినసమ్మూర్ఛితమానసాంబురుహ యై దీపించు పెందత్తఱం
బునఁ బేర్చెత్తిన లజ్జ నంత్రిప్రి కటకంబుల్ మ్రోయ నడ్డంబు ని
ల్చిన నయ్యెచ్చరఁజూచి చేరఁజని పల్కెన్ వాఁడు విభ్రాంతుఁడై.

(వరూధిని ప్రవరుడు ఆ విధముగా చేయుదురు. ప్రవరుడు పద్యము పూర్తికాకముందే వరూధిని "ఓ యువతీ ఒక్కమాట..." అని సంబోధించును.)

## ద్వితీయాంకము

ప్రవరుడు—

ఉ. ఎప్పతె నీవు భీతహరిణేక్షణ యొంటిజరించె దోటలే
కివ్వనభూమి భూసురుఁడ నేఁ బ్రవరాఖ్యుఁడఁ ద్రోవ తప్పితిన్
ద్రొవ్వన నిన్నగాగ్రమునకున్ జనుదెంచి పురంబుఁజేర నిం
కెవ్విధిఁగాంతుఁ దెల్పఁగదవే తెరువెద్ది శుభంబు నీకగున్.

(వరూధిని ఆ ప్రకారము చేయును).

వరూధిని—

ఉ. ఇంతలు కన్నులుండఁ దెరువెవ్వరి వేఁడెదు భూసురేంద్ర యే
కాంతమునందునున్న జవరాండ్ర నెపంబిడి పల్కరించులా
గింతియకాక నీవెఱుఁగవే మునువచ్చిన త్రోవచొప్పు నీ
కింత భయంబులేకడుగ నెల్లిదమైతిమె మాటలేటికిన్.

అయినా చెప్పుతాను విను నా సంగతి.

సీ. చిన్నివెన్నెల కందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ
బొడమిన చెలువ తోఁబుట్టు మాకు
రహిపుట్టు జంత్రగాత్రముల రాల్ గరఁగించు
విమలగాంధర్వంబు విద్య మాకు
ననవిల్తు శాస్త్రంపు మినుకులావర్తించు
పని వెన్నతోడఁ బెట్టినది మాకు
హయమేధ రాజసూయము లనఁ బేర్పడ్డ
సవనతంత్రంబు లుంకువలు మాకుఁ

తే. గనకనగసీమ కల్పవృక్షములనీడఁ
బచ్చరాచట్టుగమి రచ్చపట్టు మాకు

వరూధినీ ప్రవరాఖ్యము

బద్మసంభవవైకుంఠభర్గ సభలు
సాముగరిడీలు మాకు గోత్రామరేంద్ర.

క. పేరు వరూధిని విప్రకు
మార! ఘృతాచీ, తిలోత్తమా, హరిణీ, హే
మా, రంభా, శశిరేఖ లు
దారగుణాఢ్యలు మదీయ లగు ప్రాణసఖుల్.

మ. బహురత్నద్యుతిమేదురోదరదరీభాగంబులం బొల్చు ని
మ్మిహికాహార్యమునం జరింతుమెపుడుం బ్రేమంబునం భోవాహినీ
లహరీశీతలగంధవాహపరిఖేలన్ మంజరీసౌరభ
గ్రహణేందిందిరతుందిలంబు లివి మత్కాంతారసంతానముల్.

తెలిసిందా ప్రవరా? నాసంగతి తెలిసికో! బాగా తెలిసికో. ఇక్కడనే
ఉండి ఇంకా బాగా తెలిసికో.

క. భూసురకైతవకుసుమశ
రాసన! మాయింటి విందవైతివి గైకొ
మ్మా సముదంచన్మణిభవ
నాసీనత నేదదేటి యాతిథ్యంబున్.

తే. కుందనమువంటి మేను మధ్యందినాత
పోష్మహతిం గందె వడదాఁకె నొప్పులొలుకు
వదన మస్మద్గృహంబు పావనముచేసి
బడలికలు వాసి చనుము ...............

ప్రవరుడు—క్షమించు.

ఉ. అండజయాన నీవొసఁగునట్టి సపర్యలు మాకువచ్చె నిం
దుండగరాదు పోవలయు నూరికి నింటికి నిప్పుడేను రా
కుండ నొకండు వచ్చి మఱియొందునె భక్తియ చాలు సత్క్రియా
కాండము దీర్ప వేగ చనఁగావలయుఙ్ గరుణింపు నాపయిన్.

ఉ. ఏ నిక నిల్లు సేరుటకు నెద్ది యుపాయము మీమహత్త్వముల్
మానిని దివ్యముల్ మది దలంచిన నెందును మీ కసాధ్యముల్
గానము గానదల్లి ప్రజలన్ నను గూర్పు..................
.............................................................

చెలికత్తె—"మటన్న లేతన వ్వాననసీమఁదోప ధవళాయతలోచన"
ఏమి అంటుందో ?

వరూధిని—శుద్ధశ్రోత్రియా !

ఉ. ఎక్కడి యూరు కాల్నిలువ కింటికిఁ బోయెదనంచు బల్కె దీ
పక్కట మీకుటీరనిలయంబులకుఙ్ సరిరాకపోయెనే
యిక్కడి రత్నకందరము లిక్కడి సందనచందనోత్కరం
బిక్కడి గాంగసైకతము లిక్కడి యీలవలీనికుంజముల్.

నిజము చెపుతా—

ఉ. నిక్కము దాపఁనేల ధరణీసురనందన యింక నీపయిఙ్
జిక్కె మనంబు నాకు నను జిత్తజు బారికి నప్పగించెదో
చొక్కి మరందమద్యముల చూఱలఁ బాటలువాడు తేంట్లు సొం
పెక్కిన యట్టి పూవుఁబొదరిండ్లను గౌఁగిట గారవించెదో?

వరూధినీ ప్రవరాఖ్యము

ప్రవ—పాపము శమించుగాక! వనజేక్షణా! ఇలా పలుకవచ్చునా?
వ్రతాలతో దినాలుగడిపే విప్రులను కామింప న్యాయమా!
మనస్సులో ఆమాత్రం ఆలోచనవద్దా! చూడు.

ఉ. వేలిమియుఁ సురార్చనయు విప్రసపర్యయుఁ జిక్కెఁ భుక్తికిఁ
వేళయతిక్రమించె జననీ జనకుల్ కడువృద్ధు లాఁకటఁ
సోలుచుఁ జింతతో నెదురు సూచుచు నుండుదు రాహితాగ్ని నే
దూలు సమస్తధర్మములుఁ దొయ్యలి నేఁ డిలు సేరకుండినఁ.

చెలికత్తె—"నావుఁడు విన్నఁబాటు వదనంబున నించుక దోపఁబల్కఁ"
నుద్యమిస్తున్నట్లున్నది.

వరూధిని—ఓ!

భావజరూప యిట్టి యెలప్రాయము వైదికకర్మనిష్ఠలఁ
బోవఁగ నింక భోగములఁ బొందుట యెన్నఁడు యజ్ఞకోటులం
బావను లౌటకుఁ ఫలము మాకవుఁగిళ్ల సుఖించుటేకదా...

వెఱ్ఱివాడా! సిరి రా మోకా లడ్డుపెట్టువాడుగలడా! నా మాట విను.
నాదగ్గఱనుండి నా ఆలింగనంలో పరవశత్వము పొందు.

సీ. సద్యోవినిర్భిన్నసారంగనాభికా
హృతమై పిసాళించు మృగమదంబు
కసటువో బీటెండఁ గరఁగి కఱ్ఱల నంటి
గమగమ వలచు చొక్కపు జవాజి
పొఱలెత్తి ఘనసారతరువులఁ దనుఁదాన
తొరఁగిన పచ్చకప్పురపు సిరము

గొజ్జంగ పూఁబొదల్ గురియంగఁ బటికంపు
దొనల నిండిన యట్టి తుహినజలము

తే. వివిధకుసుమకదంబంబు దివిజతరుజ
మృదులవనసఫలాసవామేయరత్న
భూషణంబులు గల విందు భోగపుఁడ
వయి రమింపుము ననుఁగూడి యనుదినంబు.

ఆహా!

క. అంధునకు గొఱయె వెన్నెల
గంధర్వాంగనల పొందు గాదని సంసా
రాంధువునఁ బడియె దకట! ది
వాంధము వెలుఁగు గని గొంది నడఁగిన భంగిన్.

చూడు!

ఉ. ఎన్ని భవంబులన్ గలుగు నిష్ఠురరాసనసాయకవ్యథా
ఖిన్నత వాడి పత్తలయి కేలఁ గపోలము లూఁది చూపులన్
విన్నఁదనంబు దోఁపఁ గనువేఁదుఱునన్ బయి గాలి సోఁకినన్
వెన్నవలెన్ గరంగు నలివేణులఁ గౌఁగిటఁజేర్చు భాగ్యముల్.

అదికాకుండా,

క. కుశలత యే వ్రతములనగు
నశనాయాసమున నింద్రియనిరోధమునన్
గృశుఁడవయి యాత్మనలఁచుట
సశరీరస్వర్గసుఖము సమకొనియుండన్.

## వరూధినీ ప్రవరాఖ్యము

ప్రవరుడు—నీవన్న యర్థమెల్ల
నిజము కాముకుడైన వానికి నకాముఁ
డిది గణించునే జలజాక్షి యెఱిఁగితేని
నగర మార్గంబుఁ జూపి పుణ్యమునఁ బొమ్మ.

ఇంకొక్క మాట—

క. బ్రాహ్మణుఁ డింద్రియవశగతి
జిహ్మాచరణైకనిపుణచిత్తజనిశితా
జిహ్మగములపాలై చెడు
బ్రహ్మానందాధిరాజ్యపదవీచ్యుతుడై.

(వరూధిని ఈ క్రింది వచనానికి అనుకూలంగా ప్రవర్తించును)

చెలికత్తె—ఇప్పుడు "అత్తెఱప యక్కఱకరి పలుకుల కులికి మదనహరునైనఁ జదుపునం గదియ గమకించు తమకంబునం గొమరెప్రాయంపు మదంబునను ననన్యకన్యాసామాన్యలావణ్యరేఖామదంబునను నొంటిపాటునం గంటికిం బ్రియుండై తంగేటి జుంటి చందంబునం గొంటుఁదనం బెఱుంగక కుఱంగటనున్న యమ్మహీసురవరకుమారు తారుణ్యమౌగ్ధ్యంబులం జేసి తన వైదగ్ధ్యంబు మెఱయఁ గలిగెనని పల్లవించు నుల్లంబు నుల్లాసంబునం గదురుమదంబున నోసరించక చంచలదృగంచలప్రభలతని ముఖాంబుజంబునం బొలయ వలయమణిగణచ్ఛాయాకలాపంబు లుప్పరం బెగయఁ గొప్పు చక్కంజెక్కుచు జక్కవగిబ్బలంబోని గబ్బిగుబ్బలం బొబ్బిల్లు కుంకుమరసంబునం బంకిలంబులగు హారముక్తాతారకంబుల నఖకోరకంబులంగీఱి తీరువడంజేయుచుఁ బతితవనతరుకుసుమకేసరంబులు రాల్చు

నెపంబునం బయ్యెద విదిల్చి చక్క సవరించుచు నంతంతం బొలయు వెలుగం దలచూపకయుండఁ దత్తఱంబునం జేసి బొమముడిపాటుతో మగిడిమగిడి చూచుచుఁ జిడిముడిపాటు చూపుల నంకురించు జంకెనల వారించుచు" నతని జేరుచున్నది.

వరూధిని— ప్రవరా!

శా. ఎందే డెందము గందళించు రహిచే నేకాగ్రతన్ నిర్వృతిన్
జెందున్ గుంభగతప్రదీపకళికా శ్రీఁబోఁప నెందెందుఁ బో
కెందే నింద్రియముల్ సుఖంబుఁగను నాయింపే పరబ్రహ్మ 'మా
నందో బ్రహ్మ' యటన్న ప్రాఁజదువు నంతర్బుద్ధి నూహింపుమా.

చెలికత్తె— ...తన్నొడఁబఱుచు నయ్యమరకాంత
తత్తఱముఁజూచి యాత్మ నతండు దనకు
సిగ్గు వెగటును బొడము నిస్పృహతఁ దెలుపు
నొక్క చిఱునవ్వు 'నవ్వె'.................

ప్రవ—(దాని కనుగుణముగా చేయుచు) ఓ! యువిదా!

శా. ఈ పాండిత్యము నీకుఁదక్క మఱి యెందేఁగంటిమే కామశా
స్త్రోపాధ్యాయివి నా వచించెదవు మేలోహో! త్రయీ ధర్మముల్
పాపంబుల్ రతి పుణ్యమంచు నిఁక నేలా తర్కముల్ మోక్షల
క్ష్మీపథ్యాగమసూత్రపంక్తి కివె పో మీ సంప్రదాయార్థముల్.

మ. తరుణీ! రేపును మాపు హవ్యములచేతన్ దృప్తుఁడౌ వహ్ని స
త్కరుణాదృష్టి నొసంగు సౌఖ్యము లెఱుంగన్ శక్యమే నీకు నా
కరణుల్ దర్భలు నగ్నులున్ బ్రియములైన ట్లన్యముల్ గావౌదల్
తిరమే చెప్పకు మిట్టి తుచ్ఛసుఖముల్ మీసాలపైఁ దేనియల్.

## వరూధినీ ప్రవరాఖ్యము

చెలికత్తె—పాపం వరూధిని "మాటలేక హృదయాబ్జము జల్లన మోము వెల్లనై, కనలుచు నీరుదేఱు తెలిగన్నుల నాతనిఁ బుల్కుపుల్కునన్, గనుఁగొని మాటలంబొదువు గద్గదికన్ దలయూఁచి" ఏమో చెప్పబోతున్నది.

వరూధిని—(ఆ సమయాన అట్లు చేయుచు) ....అక్కటా!

వనితతనంతఁదా వలచి వచ్చినఁ జుల్కనగాదె యేరికిన్ ?
ప్రవరాఖ్య మనోభవా !

మ. వెతలన్ బెట్టకు మింక నన్ (అనుచు ఈ క్రింది పద్యమునకు అనుకూలంగా చేయును.)

చెలికత్తె—ఆహా !

నీవీబంధ మూడన్ రయో
ద్ధతి నూర్పుల్ నిగుడన్ వడిన్ విరులు చిందన్ గొప్పు వీడన్ దనూ
లత తోడ్తోఁ బులకింపఁగా ననునయాలాపాతిదీనాస్యయై
రతిసంరంభము మీఱ నిర్జరవధూరత్నంబు పై పాటునన్.

శా. ప్రాంచద్భూషణబాహుమూలరుచితోఁ బాలిండ్లు పొంగారఁ బై
యంచుల్ మ్రోవఁగఁ గౌఁగిలించి యధరం బాసింప హా! శ్రీహరీ!
యంచున్ బ్రాహ్మణుఁడోరమోమిడితదీయాంసద్వయంబంటి పో
మ్మంచున్ ద్రోచెఁ, గలంచునే సతుల మాయల్ ధీరచిత్తంబులన్.

(వరూధినీ ప్రవరులు పైపద్యమునకును క్రింది పద్యమునకు అనుగుణముగా వర్తించుచుందురు.)

క. త్రోపువడి నిలిచి ఘనల
జ్జాపరవశ యగుచుఁ గొప్పు సవరించి యొదల్

దీపింప నతనిఁ జూచుచుఁ
గోపమునన్ జూచి త్రేఁటు కొనుచున్—

'ఏదో పలుకుతున్నది.'

వరూధిని—

ఉ. పాటున కింతులోర్తురె కృపారహితాత్మక నీవు త్రోవ ని
చ్చోట బ్రసన్నఘాంకురము సోఁకెఁ గనుంగొనుము....

చెలికత్తె—..............................అంచు జూపియ
ప్పాటలగంధి వేదననెపం బిడి యేడ్చెఁ గలస్వనంబుతో
మీటిన విచ్చు గుబ్బచను మిట్టల నశ్రులు చిందువందఁగన్.

(దీని కనుగుణంగా వరూధినీ ప్రవరులు నటింతురు.)

అయ్యో! పాపం

క. ఈ విధమున నతి కరుణము
గా వనరుహనేత్ర కన్నుఁగవ ధవళరుచుల్
కావిగొన నేడ్చి వెండియు
నా విప్రకుమారుఁ జూచి అలమట....

ఏమో పల్కబోతున్నట్లుంది....

వరూధిని—

చేసితి జన్మముల్ తపము చేసితి నంటి దయావిహీనతన్
జేసిన పుణ్యముల్ ఫలము నెందునె పుణ్యము లెన్ని యేనియున్
జేసిన వాని సద్గతియె చేకుఱు భూతదయార్ద్రబుద్ధి కో
భూసుర వర్య యింత దలపోయవు నీ చదువేల చెప్పుమా.

ప్రవరా——కాలాతీతం అసత్యాతీతం ఐ స్వప్రకాశం ఐ వెలిగే మహా ధర్మం దాని సౌఖ్యం అనుభవైకవేద్యాలు.

వరూ—ఏమీ? అందరిలో నువ్వే ధర్మం తెలిసిన వాడవూ, గొప్ప వాడవూ!

సీ. వెలివెట్టిరే బాడబులు పరాశరుఁ బట్టి
దాశకన్యాకేళి దప్పుఁజేసి
కులములో వన్నె తక్కువ యయ్యెనే గాధి
పట్టికి మేనక చుట్టరికము
ననుపుకాఁడై వేల్పు నాగవాసముఁగూడి
మహిమ గోల్పడియెనే మాందకర్ణి
స్వారాజ్య మేలంగ నీరైరె సుర లహ
ల్యాజారుఁడైన జంభాసురారి

తే. వారికంటెను నీ మహత్త్వంబు ఘనమె
పవనపర్ణాంబుభక్షులై నపసి యినుప
కచ్చడాల్ గట్టుకొను మునిముచ్చు లెల్ల
తామరసనేత్ర లిండ్ల బందాలు గారె.

చూడూ! ప్రస్తుతం శరీర సౌఖ్యం, హృదయానుభవం మాత్రమే సత్యం, అనుభవనీయం. అదే జీవితం, మిగిలినదంతా కృత్రిమం. అనవసరం ఐన గొడవ; మిథ్య.

ప్రవ——(ప్రత్యుత్తరం ఈయకే నిష్క్రమించును)

వరూధిని—(నిర్విణ్ణయై అతనివైపే చూచుచుండును)

(వరూధినిని చెలికత్తెను కప్పివైచుచు ముందునున్న తెరకు వెనుకనున్న తెర పడును).

# ద్వితీయాంకము

## రంగము 3

ప్రవేశం : ప్రవరుడు

ప్రవ—అబ్బా ! ఆ వనజగంధి శరీరంయొక్క జవ్వాదిపస అంటుకొన్న నా శరీరాన్ని కడిగివేసి కొనుటచేత నా కిప్పుడు శాంతి కలిగినది. ఇంక వార్చి గార్హపత్యవహ్నిని పొగడవలెను.

(వార్చును).

ఉ. దివిషద్వర్గము నీ ముఖంబునన తృప్తింగాంచు నిన్నీశుఁగా
స్తవముల్ సేయు శ్రుతుల్ సమస్తజగదంతర్యామివిస్ నీవయా
పావనీయంబగు దక్షిణాగ్నియును నీయం దుద్భవించున్ గ్రతూ
త్సవసంధాయకనన్నుఁగావఁగదవే స్వాహావధూవల్లభా !.

ఉ. దానజపాగ్నిహోత్రపరితంత్రుఁడనేని భవత్పదాంబుజ
ధ్యానరతుండనేనిఁ బరదారధనాదులఁ గోరనేని స
న్మానముతోడ నన్ను సదనంబున నిల్పి మినుండు పశ్చిమాం
భోనిధిలోనఁ గ్రుంకకయమున్న రయంబున హవ్యవాహనా !

(తెరపడును).

(తెరలో)

శా. నిస్తంద్రప్రతిభాసుపీనుత దిశోన్నిర్మలద్యశ్శ్రీస్వవధూ
హస్తాగ్రామలకాయమానమహనీయాంభోజగర్భాండసై
న్యస్తోమోత్థరజోప్రజస్థగిత కృష్ణా గౌతమీ మధ్య భూ
మ్యస్తోకోత్కలి రాట్పురీ హరణ తేలావార్య శౌర్యోదయా.

# వరూధినీ ప్రవరాఖ్యము

## తృతీయాంకము

### రంగము ౧

ప్రదేశము : వరూధిని ఉద్యాన వనము.
వేదిక ఒకటి యుండును.

1 చెలికత్తె—వరూధిని అవస్థ చూస్తే గుండె బ్రద్దలై పోవుచున్నది.

శా. ఆ భూదేవకుమారుఁ డేఁగినఁ దదీయానూనరమ్యాకృతిన్
దా భావంబున నిల్పి యంగభవకోదండోగ్రమౌర్వీరవ
క్షోభాకంపితధైర్యయై యలఁత నచ్చో నిల్వకచ్చెల్వ త
ద్భూభృన్మేఖల వెంటఁ గానల బడిన్ దుఃఖాబ్ధినిర్మగ్నయై.

తిరిగి తిరిగి ఆధరణీసురవరుని కానక తిరిగివస్తున్నది.
(వరూధిని, రెండవ చెలికత్తె ప్రవేశించును)

వరూధిని—

ఉ. అక్కట వాఁడు నాతగుల మాఱడిసేసి దయావిహీనుఁడై
చిక్కక త్రోచి పోయె దరిఁ జేరఁగరాని వియోగసాగరం
బెక్కడ నీఁదుదాన నిఁక నీకొఱనోములు నోచి నట్టి నే
నెక్కడ వాని కౌఁగి లది యెక్కడ హా విధి యేమిసేయుదున్!

హా, నా ప్రేమధర్మం కన్న ఏ ధర్మం గొప్పది? ఈ శరీర సౌఖ్యంకంటె స్వర్గలోకసౌఖ్యం గొప్పదా? (ఊరకుండి) అతని

నిశ్చితంకన్న గొప్పదైన నిశ్చయాన్ని ప్రకటిస్తా. స్వేచ్ఛాజీవిని, రసజీవిని ఐన నేను ఇకనుండి ప్రవరునికంటె భిన్నులైన ఎవ్వరికిని లభ్యనుకాను. అబ్బా! వానిరూపు మరచి పోలేకున్నాను, ఎంత ప్రయత్నించినా.

ఉ. కమ్మని కుంటనంబు కసుగందని మే నెలదేఁటి దాటులన్
బమ్మెర వోవఁ దోలుఁదెగ బారెఁడు వెండ్రుక లిందుబింబమున్
గిమ్మన నీదు మోము గిరిక్రేపులు మూఁపులు కౌనుగానరా
దమ్మకచెల్ల! వాని వికచాంబకముల్ శతపత్రచైత్రముల్.

(కొంచెము ఊరకుండి) నా జీవితము నిరర్థకం.

ఉ. చొక్కపుఁ బ్రాయమున్ మిగులసోయగమున్ గలప్రాణనాయకుం
డెక్కడు పశ్యతజ్ఞ తుల నేఁకట దీర్చి సమేళమొప్పగా
నక్కున గారవించి ప్రియమందఁగ నోఁచని యింతిదైన యా
చక్కదనం బదేమిటికి జవ్వనమేటికిఁ బ్రాణమేటికిన్.

ఆహా:

ఉ. ఎంతతపంబు సేసి జనియించిన వారొకొ మర్త్యభామినుల్
కాంతుఁ డపజ్ఞ సేసినను గాయము వాయుదు రే నమర్త్యనై
చింతల పంతలన్ జివికి సిగ్గటితిన్ మృతిలేని నాదు చె
ల్వింతయు శూన్యగేహమున కెత్తినదీపిక యయ్యె నక్కటా!

(విరహబాధ ప్రకటించుచు, ఉస్సురనుచు, కన్నీరు కార్చుచు, చంద్రకాంత శిలాతలాన పరుండును.)

1 చెలికత్తె—

చ. తరుణి ససస్యకాంత నతిదారుణపుష్పశిలీముఖవ్యథా
భరవివశాంగి నంగభవుబారికి నగ్గముసేసి క్రూరుఁడై

యరిగె మహీసురాధముఁ డహంకృతితో నని రోషభీషణ
స్ఫురణ వహించెనో యన నభోమణిదాల్చెఁ గషాయదీధితిన్.

2 చెలి—సీ. ఉరుదరీకుహరసుప్తోత్థశార్దూలముల్
ఝురవారి శోణితశంకఁ ద్రావ
వనకుంజమధ్యశాద్వలచరన్మృగపంక్తి
దావపావక భీతిఁ దల్లడిల్ల
నాశ్రమాంతరభూరుహాగ్రముల్ మునికోటి
బద్ధకాషాయవిభ్రాంతిఁ జూడ
ఘనసానుశృంగశృంగాటకంబులఁ గాంచి
యమరులు హేమాద్రి యనుచు వాలఁ

తే. గానెఁ బేశలరుచిఁ గింశుకప్రవాళ
ఘుసృణకిసలయకంకేళికుసుమగుచ్ఛ
బంధుజీవజపారాగబాంధవంబు
లన్నగంబున జరఠారుణాతపములు.

1 చెలికత్తె—
శా. శ్రేణుల్ గట్టి నభోంతరాళమున బాఱెం బక్షు లుష్ణాంశు పా
షాణవ్రాతము కోష్ణమయ్యె మృగతృష్ణావార్ధు లింకెం జపా
శోణం బయ్యెఁ బతంగబింబము దిశాస్తోమంబు శోభాదరి
ద్రాణంబయ్యె సరోజషండములు నిద్రాణంబు లయ్యెం గడున్.

2 చెలి—క. తరణి యదె క్రుంకుచున్నాఁ
డపుడె మ్మని చంద్రుఁ బిల్వ నరిగెడు రజనీ
తరుణీమణి దూతిక లన
నరిగెం దూర్పునకు నీడ లతిదీర్ఘములై.

# తృతీయాంకము

1 చెలి—క. క్రుంకె నపరాంబురాశిం
బంకజబంధుఁడు దదీయబడబాముఖవీ
షాంకురితకుతుకరథ్యని
రంకుశవేగాపహృతశతాంగుఁడు వోలెన్.

2 చెలి—సీ. ఏపిహంగముఁగన్నసెలుఁగించుచును సారె
కుసు సైకతంబులఁ గూడఁదాఱుఁ
దాటి కన్గొని యది తన జోడుగాకున్న
మెడయెత్తి కలయంగ మింటనరయు
నరసి కన్నీటితో మరలి తామరయెక్కి
వదన మెండగ సరోవారి నద్దు
నద్ది త్రావఁగ సైఁప కట్టిట్టు గన్గొని
ప్రతిబింబ మీక్షించి బ్రమసి యుఱుకు

తే. నుఱికి యెఱకలు దడియ వేటొక్కతమ్మి
కరుగు నరగి రపంబుతోఁ దిరుగుతేంట్లఁ
బొడుచు ముక్కున మఱియును బోవు వెదక
సంజఁబ్రియుఁబాసి పగనొక్క చక్రవాకి.

1 చెలి—సీ. రవిబింబపతన దీర్ణపయోధిగర్భని
ర్గతశేషఫణిఫణారత్నరుచియొ
దివసావసానసందీప్తాస్తగిరిశిఖా
జ్యోతిర్లతాప్రతానాతపంబొ
తపనధూర్దండనిర్దళిత దిక్తటదృశ్య
కమలజాండకటాహకనకఘృణియొ

వరూధినీ ప్రవరాఖ్యము

చండీశతాండవోత్సవసంభృతక్షపా
హస్తాగ్రదీపగభస్తిచయమొ

తే. ద్రాగ్విదాహచ్ఛిదావినిద్రాణమదవ
దంజనాలానమూలశయ్యావిధాన
వారణాధోరణాకల్పితోరుశోణ
మృత్తికారాశియోయన మెఱసె సంధ్య.

2 చెలి—క. బహాళజలప్లవమాన
ద్రుహిణాండము చెమ్మయుటికి రూక్షార్క-విభా
రహితతఁ గాటుకపట్టెను
రహిచెడి యన నంధతమసరాసులు చెరచెన్.

1 చెలి—సీ. మృగనాభిపంకంబు మెయినిండ నలఁదిన
మాయాకిరాతు మై చాయఁదెగడి
నవపింఛమయభూష లవధరించి నటించు
పంకజాక్షుని చెల్వు సుంక మడిగి
కాదంబనికురుంబకలితయై ప్రవహించు
కాళింది గర్వంబుఁ గాకుసేసి
తాపింఛవిటపికాంతారసంవృతమైన
యంజనాచలరేఖ నవఘళించి

తే. కవిసె మఱియును గాకోలకాలకంఠ
కంఠకలకంఠకరిఘటాఖంజరీట
ఘనఘనాఘనసంకాశగాఢకాంతిఁ
గటికిచీకటి రోదసీగహ్వరమున.

2 చెలి—క. అంతటఁ బ్రాచి నిశాపతి
యంతికగతుఁడౌట విని ముఖాలంబితమః
కుంతలములు దీర్పఁగఁగొను
దంతపు దువ్వెన యనంగ ధవళిమదోచెన్.

1 చెలికత్తె—

చ. మరున కొసంగఁగాలము తమశ్ఛట గాటుకగా నవోదయ
స్ఫురదరుణ ప్రభాపథికశోణితసిక్తసితోడుభక్తముఁ
హరిహయదిఙ్ముఖస్థ్సలమునఁ బలి చల్లి పటాంకముఁ వసూ
త్కరధరితంబు నై వెలుఁగఁ గాంచి సుధానిధి నెత్తె నత్తఱిన్.

2 చెలికత్తె—

మ. జలదాగారపరంపరల్ మఘవదాశాభిత్తిఁ దీండ్రించుచుఁ
దళమై వెన్నెల చిచ్చులంటిన మిళద్బాహ్యాచ్ఛదశ్యామికా
చ్ఛలనఁ గంది ముడుంగుచో సిమసిమచ్ఛబ్దంబుతోఁ బుట్టు న
గ్గలపుం గ్రొంబొగలో యనంగ వెడలె న్గర్భస్వనద్భృంగముల్.

1 చెలి—సీ. ప్రిదిలి తెరపడళశ్రేణి నొక్కులు దీరె
శశికాంతపంక్తుల జలము లూరెఁ
గొరి కాంతులతోఁ జకోరికల్ రతిఁ గేరె
వారాశి గర్వంబు మేరమీటెఁ
ద్రోపడి యిరులు పటాపంచలై పాఱె
దిఙ్ముఖంబుల వింత తెలివి సేరెఁ
జక్రవాకంబు లబ్జకుడుంగములఁ దూఱెఁ
గామినీకాంతుల కలఁక దేఱె

వరూధినీ ప్రవరాఖ్యము

తే. మదను డమ్ములనూఱె హిమంబుపేరె
జడిసి విరహిణి వగఁగూరె జారచోర
దర్పములు జాఱె రవికరతాపమాఱెఁ
జూడఁజూడంగఁ దారకస్ఫురణదాఱె.

2 చెలికత్తె—

మ. స్ఫుటసౌగంధికరాగరక్తరుచిమైఁబూనెన్ జపాసన్నిధి
స్ఫటికంబ ట్లుదయాద్రిగైరిక శిరస్థానస్థితిన్ జంద్రుఁ డ
చ్చొటువాయన్ శుచియయ్యెనౌ బ్రకృతి నచ్ఛుండైనసన్మార్గియె
న్నటికిన్ గూటమివంక వచ్చు వికృతిన్ మగ్నుండు గానేర్చునే.

1 చెలికత్తె—

శా. ఆరూఢస్థితిఁ జంద్రికాధవళితాజాండంబులో జంద్రుఁడొ
ప్పారెన్ గాలభిషగ్వరుం డవిరతంబై కాముక శ్రేణికిన్
మారోత్సాహము నిల్వఁ బాదరసమున్ బంధించి గ్రాసార్థమై
క్షీరస్థాలికఁ బెట్టినట్టి గుటికాసిద్ధౌషధంబో యనన్.

2 చెలి—తే. రాజు తేజస్వియై గ్రహరాజుమీఁద
నలిగి దాడిగ వెంటాడ నిలువ కతఁడు
బెగడువడి పాఱుచోఁ జెఱఁదగిలినట్టి
ఛాయ యిది యన నీలలాంఛనము మెఱసె.

1 చెలి—తే. కలయ జగమునఁ గలయట్టి నలుపులెల్లఁ
దెలుపులుగ జేసి నీడలు దెలుపుసేయఁ
గా వశముగామిఁ బొడము దుఃఖమునఁబోలె
సాంద్రచంద్రిక తుహినబాష్పములు గురిసె.

2 చెలికత్తె—రః వెన్నెల విరహజనానికి ఎంత బాధకారియో ప్రియా సమీపప్రాప్తులైన కాముకులకు అంత సంతోషకారి. వెన్నెల పిండిచల్లిన గతిం గాయ డాయలజ్జించి బుజ్జవంబునం బొదరింట్లకుం దార్చి కాంతులంగవయు నంగనాచులగు నంగనల యంగంబులపస ముంగిటంబడఁ జలితకిసల యాంతరాళంబులంపూటిటూటి యిరులు విరియించి పతుల ప్రార్థనంబులం బుంథావసురతాపంబరంబునకుఁ దోడు సూపి దూపటిలి యంగరాగంబులు గరంగం జెమర్చిన చంచలాక్షుల నిద్దంపుఁ దసూలతలంబుట్టి దట్టంబులగు చిఱుచెమట బొట్టులం బొడకట్టి తెలుపారు మలయజంపుఁ జిటులు గందంబుల యందంబు లొసంగి సంజరటం దారునొడివిన సంకేతంబుల నుండక తెరువుగట్టి పొటవుఁ దరువుల నీడల నడంగి నవ్వుటాలకు వెనుకపాటునం గదిసి ముసుంగు తెడలింప బెగడి కళవళంపుఁ జూపుల వల్లభులంజూచి యల్లననగు నభిసారికల వెడంద కన్నులచెన్నునసున్నకొని, పొచలు మదనోన్మాదంబునకుం బ్రోచిగామోదంబునం గాదంబరి గండూషించి విటకదంబంబునకు నొసంగు నంబుజహాముఖుల యొప్పులకుప్పలగు నిప్పపూమొగ్గలంబోని బుగ్గలందగ్గలికసూపు కమ్మపంజుల వజ్రపుం జిరచకల నకనకలు వీడుకొని కలికితనంబునం గలసి మెలసి రతాంతంబునం బరిశ్రాంతి యడంగ నంగణంబుల నిలిచి యొంపౌరుల కురులు దువ్వుచు విహరించు సమయంబునం బల్లవులు రేశికల్లప్పుడన్నమాటలు దలఁపించిన నుదరిపడి మందస్మితంబు లంకురించు హుంకృతుల జంకించి కంకణంబుల రత్నంపు దళుకులుసెదరు. ఆహా! ఎలాంటి విచిత్రమైన రుచిః

## వరూధినీ ప్రవరాఖ్యము

వరూధిని—అబ్బా! ప్రకృతి అంతా కలిసి నన్ను ఎలా దహించి వేస్తుందో! అందులో ఈ వెన్నెలబాధ నేను భరించలేను.

ఉ. నోములు నోఁచినమ్మలు మనోరథముల్ దయివాఱ నిత్తఱిన్
దామరతంపరై ప్రియులుఁదారు విహారము సల్ప వీరిలో
నీ మెయి దుఃఖశీలనగు నే వసియింపఁదరంబె పోద మా
రామముఁజూడ నందు సుకరంబగు సర్వము నంబుజాననా.

(పాన్పుదిగి) చంద్రాతపమువేడి చాలా ఎక్కువగా ఉంది.

(పైటచెరగు ముసుగువేసుకొని) మన కేళీవనానికి వెళదాము.

(వరూధిని, రెండవ చెలికత్తె నిష్క్రమింతురు).

1 చెలి—సీ. చనుఁగప్పు దొలఁగ వాసనగాలి కెదురేఁగుఁ
బరువొప్పు నలుఁగులఁ బాఱుకరణి
నిడుదవేనలి నూనెముడి వీడఁ జిగురాకు
పొదఁదూఱుఁ గార్చిచ్చుఁ గదియు కరణిఁ
బసిఁడి గాజులుపైకి వెసఁద్రోచి నునుఁదీగఁ
దెమలించు నరిత్రాడు నెమకుకరణి
మొలనూలు బిగియించి వెలఁది వెన్నెల బొచ్చుఁ
బిఱుదీయ కేటిలో నుఱుకుకరణి

తే. జడియ దళులకుఁ గురియు పుప్పొడుల మునుఁగు
మావికడనిల్చు విరుల నెత్తావిఁగ్రోలు
విషమసాయకు నేఁపుల విసివిసివి
తనువుఁ దొఱఁగంగఁ దలఁచి యవ్వనరుహాక్షి.

నేనుకూడా వెళ్లి ఈమెను కొంత వారించ ప్రయత్నిస్తాను.

## తృతీయాంకము

(మొదటి చెలికత్తె నిష్క్రమింపబోవ, రెండవ చెలికత్తె తీసికొనిరాగా వరూధిని ప్రవేశించును).

2 చెలికత్తె—వరూధినీ! రా. కొంచెము విశ్రాంతి తీసికో.
(వరూధిని కన్నీరు కార్చుచుండును).

1 చెలికత్తె—వరూధినీ! ఇది తగదమ్మా. (తన చీరకొంగుతో వరూధిని కన్నీరు తుడుచుచు)

ఉ. పూఁతపసిండివంటి వలపుం బచరించు కులంబునీతికిన్
లేఁతగదమ్మ యుత్తలఁగ లేమ సురాంగనలెల్ల నిట్టినీ
చేఁతలు సేత్తురిష్టు దయసేయక తిన్నని మేను వెన్నెలన్
వేఁదురఁటమ్మ యింతలను వేఁదుఱుసెల్లునఁటమ్మ యింతికిన్.

2 చెలికత్తె—(వరూధినిని సంబోధించి)

చ. ఉడుపతి బారికిన్ వెఱచి యూరటయౌనని పేటటామనిన్
ముడిపడు కంతుసేసలకు ముయ్యేలగు ట్టయినట్టియందు రా
నడఁగునె తాపవహ్నిమనమై హరిణేక్షణ ముల్లుపుచ్చి కొ
ఱ్ఱడిచిన చందమయ్యెఁ బచ మాయలదోఁటఁ జరింప కింటికిన్.

వరూధిని—(పాన్పుగ్గున వేదికపై చేరి విరహము నటించుచు లేచి కూర్చుండి కన్నీరు గోటితో మీటుచు చంద్రునిచూచుచు).

క. ఓ చెల్లి! విరహిణీవధ
మేచతురత నీకు దురితమే చేయుపనుల్
రాచటికపు ఫలమే య
య్యో! చంద్ర! వివేక మెఱుఁగ వాకొ గురుసేవన్.

వరూధినీ ప్రవరాఖ్యము

చీ!

సీ. తొలుదొల్తఁ గమలమిత్రుని వంక రూపొట
దక్షాధ్వరధ్వంసి తన్నుగనుటఁ
బరివేషమిషమునఁ బాశంబుదాల్చుటఁ
గప్పుదేహమునందుఁ గానఁబడుట
గాలవశంబునఁగాని తోపకయుంట
సతతనిష్ఠురగదాన్వితత గనుటఁ
బూని పాండుక్షేత్రమునఁ బ్రవర్తించుటఁ
బ్రకటానురాగ తారకుఁ డగుటను
తే. నంతరం బెద్ది యాత్మలో నరసిచూడ
రాజ! నీకును నలధర్మరాజునకును
బ్రాణిలోకంబు బాధలఁ బఱచునపుడు
ధర్మపద మొక్కడెక్కుడా ధన్యునందు.

చూచుకో.

చ. ఒక పెనుఁబాఁపతేఁడు చలమొప్ప రసాతలసీమకుఁ జకో
రకములు భూతధాత్రికి సురల్ దివికిఁ బగదీఱునట్లుగా
మెకమెకపాటుతోడ నిను మ్రింగకపోరెపుడుఁ ద్రిలోక కం
టకుఁడవుగాన నీయొడలు నజ్జుగఁజేసి కురంగలాంఛనా.

క. వాతాపివలన నెఱఁగితొ
శీతకరణ కడుపుఁజొచ్చి జీర్ణింపనియీ
రీతి నినుఁదినియు నాయువు
చేతసురల్ చెదరుగాక చెఱుపవె వారిన్.

తే. త్రిపురసంహార మొనరించునపుడు హరుఁడు
బండికల్లుగ నీమేను గండి చేసె

నదియు నెలవాటి తెగటాఱ వైతి చంద్ర
యకట! రోహిణియెడ నపథ్యమునఁ జేసి.

తే. పాలఁ బుట్టినమాత్రాన మేలిగుణము
నేఁడు నీకేల గల్గునో నీరజారి
నీటఁబుట్టిన వాఁడుకాఁడోటు వహ్ని
గాల్చుచున్నాఁడు జగమెల్ల గరుణలేక.

క. గోవధము సేయు తురకల
దైవంబవు నీవు మొదలఁ దక్కక పాంథ
స్త్రీవధము సేయ రోయుదె
నీవర్తన మేమిచెప్ప నీరజవైరీ.

క. విడువక తలపయిఁ గొన్నా
ళ్లిడి చూచి కళంకివగుట యెఱిఁగి మహేశుం
డుడుకుచు దక్షాధ్వరమున
నడుగునఁ బడవైచె దాన నడఁగవు చంద్రా.

క. గాండీవము నీచేతిది
పాండవునిఁ జేరఁబట్టి బ్రతికితి మావి
ల్లుండిన నేఁడు నిశాచర
చెండవె యల్లునికిఁదోడు శితభల్లములన్.

....అబ్బా! ప్రకృతికిని, మానవత్వానికి ఎంత సంబంధమో!
భరించలేను.

1 చెలికత్తె—అమ్మా! శాంతించు.

వరూధినీ ప్రవరాఖ్యము

వరూధిని—శాంతించడమా ! హృదయం తపించిపోతుంటే, శరీరం మండిపోతుంటే, శాంతించటం ఏలా ! ఈ మన్మథ బాధలో శాంతి అసంభవం - ఓ మన్మథా !

చ. తొడిఁబడఁబాటి పైకుటికి ధూర్జటి కంటికడింది మంటలో
నడపొడగానరాక తెగటాఱియుఁ గాలినయట్టి మ్రోడుకై
వడి రతిలోచనాంబువుల వాన నిగిర్చితె పాంథబాధకై
మడియ కనంగ యవ్వేలఁది మంగళసూత్ర మహత్త్వమెట్టిదో.

శా. సాహంకారత శంకరుం డలిగి నేత్రాగ్నిఁ బయిఁ బంపినన్
స్వాహాకాముకుఁడౌట నిన్నతఁడు గావంబోలు మోమోడి సం
దేహంబేని రతీశ సీవు మగుడన్ దేహంబుతో నుండుటె
ట్లాహా ! దైవము దోసకారులకె తోడైవచ్చు నెప్పట్టునన్.

చ. జడనొకయింతలేని నెఱచక్కఁదనంబుల నెల్లఁగూర్పఁగాఁ
బొడవయినట్టి ధన్యుఁడవు భోగివి పూవిలుకాఁడ విట్టి నీ
వెడపక నిష్ఠురత్వమున కెట్లలవాటుగఁజేసి తక్కటా !
పడఁతులమీఁద నేయ రతిపయ్యెదకున్ ననుపైన చేతులన్.

1 చెలికత్తె—అమ్మా ! చల్లని మలయమారుతం వీస్తున్నది. ఉప శమించు.

వరూధిని—ఈ మలయమారుతం నాకు శాంతి నిస్తుందా ! దీనిబాధ భరించలేకపోతున్నాను....

ఉ. అక్కట గంధవాహ తగవా హరిణాంకునిఁగూడి పాంథులన్
బొక్కఁగఁజేయఁ బావకుని పొందొనరించి జగమ్ములేర్చనీ
యక్కొఱగామి మాన వది యట్టిద చుల్కని వృత్తి దుర్జనుం
డొక్కనిఁజొచ్చి క్రిందుపడు నొండ్లకుఁ గీడొనరింపఁగల్గినన్.

క. నాలుకలు రెండు నిన్నున్
గ్రోలనె కల్పించెనలువ ఘోరాహికి న
న్నాలిగ్రహ మిపుడుఁ దెగఁదినఁ
జాలవ మృదుపవన విరహిజన దురితమునన్.

(అంత వరూధని సఖార్చిల్లును, చెలికత్తెలు కలువలు, పన్నీటి వెల్లువలు, కర్పూరగంధము, తామరతూండ్ల తుంపులుచేతను అవయవాలకు శిశిరోపచారాలు చేయగా వరూధని స్మృతిని పొందును.)

2 చెలికత్తె—వరూధినీ! తెల్లవారుచున్నది.

ఉ. పాటనసేయమిన్ సరులు పైఁబడి శీర్ణపటీరపంకలా
లాటికమై చిరస్మితవిలాసపుఁజంద్రిక వొంకివాడుటన్
దేటఁదొలంగి విన్ననగు నీమొగమోయన మాసి చంద్రుఁ డో
పాటలగంధి వ్రాలె నదె భానురుచిన్ దనకందు మీఱఁగన్.

1 చెలి—సీ. సకుటుంబముగ వీఁగి చరమశైలముఁ జేరు
తుహినాంశు దుముదారు దొరయనంగ
నాసీరమైవచ్చు నలినబాంధవు చెక్కి-
యంబుపై దీపించు నద్దమనఁగ
సరుణాగ్రనిబిడ వాద్యములలోఁ గనుపట్టు
సమయశాంఖికుచేతి శంఖమనఁగ
నిసుఁ దప్పు దఱిఁ దౌట మునుమున్న పడివాగెఁ
గొనివచ్చురాయంచ కొదమయనఁగ

తే. సుచియగిరిమీఁదఁ గోపురంబుండి నిగుడు
నహితరవిరశ్మిచే బద్ధుఁడగుచుఁదోడి

వరూధినీ ప్రవరాఖ్యము

బలఁగమైనట్టి చుక్కల వలసత్రోవఁ
జూపనేతెంచె నన వేగుఁజుక్కపొడిచె.

2 చెలికత్తె—

మ. సకలాశాగతి నర్మకోపవిరతి శ్రౌతక్రియారంభణా
త్మకవర్గత్రయికిన్ మదుచ్చరితశబ్దజ్ఞానమే మూల మిం
తకుఁబోలన్ వినుఁడంచుఁ దెల్పుగతిఁజెంతన్ గొండపైపల్లెలన్
గృకవాకుల్ మొరసెన్ గృహోపరిద్రిభంగిస్ ఘుగ్ఘకంఠధ్వనిన్.

1 చెలికత్తె—

ఇనుఁ డస్తాద్రికిఁ బోవఁగొల్లగొని నేఁడేతేరఁ దద్దీప్తినం
జనసంబంధజ బాంధవంబున రతిశ్రాంతాంగనానేత్రకో
ణనికాయంబుల డాఁచి తద్దవళిమన్ దాఁబూనెనోచొప్పుమా
ర్పననన్ వెల్వెలఁబాఱె దీపకళికావ్రాతంబు శాతోదరీ.

2 చెలికత్తె—

శా. వాలారుంగొనగోళ్ల నీవలసతన్ వాయించుచో నాటకున్
మేళంబైన విపంచి నిన్నమొదలున్ నీవంటమింజేసె యా
యాలాపంబె యవేళఁబల్కెడుఁ బ్రభాతాయాతవాతాహతా
లోలత్తంత్రుల మేళవింపఁగదవే లోలాక్షిదేశాక్షికిన్.

1 చెలికత్తె—

పలుకులు నేర్పువేళఁ గలభాషిణి నీ విటులుండఁ బంజరం
బుల నరగన్నువెట్టి ముఖముల్ చరణాగ్రనఖాళిఁ గ్రోఁకుచున్
నిలుగుచు నావులించుచు వనీవిహగోత్కర మెట్లుపల్కిన
ప్పలుకులె యట్టులెత్తి విని పల్కెడు వింటివె కీరశారికల్.

2 చెలికత్తె—

ఉరుసంధ్యాతపశోణమృత్కలితమై యొప్పారు బ్రహ్మాండమ
న్గరిడీఁగాలపు పాంతకాఁడు చరమాగస్కంధముం జేర్చు ని
బ్బరపుఁసంగడమోయనన్ శశి డిగెన్ బ్రాగ్భూమిభృత్కైతవే
తరబాహాగ్రపు సంగడంబనఁగ మార్తాండుండు దోచెన్ దివిన్.

1 చెలికత్తె—

కరపరి గూఁటఁగట్టి యిడఁగా మొఱవెట్టెడులీల బాల భా
స్కరకరకాండకంపకవిఘట్టన నించుక వాయివడ్డ తా
మర మొఱవెట్టిపెట్టి పలుమాఱును వాకిలిదాఁటి యాఁగుచున్
మొరయు విపంచి మీటుగతి మ్రోసియళుల్ వెడలెన్ గొలంకులన్.

2 చెలికత్తె—

చ. అపరుసపిసఖాసుకిరణానల మంటినఁగూడుకొన్న పు
ప్పొడికొలు చెల్లమోచికొని పోయెడి సంభ్రమమొప్పఁగంటివే
పడఁతి ఖపద్విహారపనపద్మసరఃకుముదాలయంబులన్
వెడలు మిళిందబృందములు వీఁపు పిశంగిమకైతవంబునన్.

1 చెలికత్తె—

చ. కొలకొలఁగూయుఁ బైనొఱగుఁ గుత్తుకఁగుత్తుకఁజుట్టుఁబాఱుచి
ల్వాలక్రియుఁ గాసరాని గతులన్ మయిమైఁ బెనచున్ జనించు న
ఖ్రలయుత నొత్తు సోలునిలుచున్ విధిచాతురిఁ గూడియున్ రతిన్
చలఁపపుడంచె పాసిన వెతల్ దలఁపించుచుఁ గోకదంపతుల్.

2 చెలికత్తె—

ఉ. ఇందునిభాస్య వాఁడనఁగ నింద్రుఁడొ చంద్రుఁడొ యాయుపేం
ద్రుఁడో, యిందులకై పగన్ బొగులనేటికి నేఁటికినందుఁబోద

వరూధినీ ప్రవరాఖ్యము

మా. నందనభూమి భూమిసురనందనుఁ డుండకపోఁడు రమ్మ నీ
చందమునందమున్ గనిన జవ్వని యెవ్వని వెఱ్ఱిఁజేయదే.

1 చెలికత్తె—
ఏల దురంతవేదనమెయిన్ బొరలాడెదు తాల్మిదక్కి మే
లే లలితాంగి యెంతపని లెమ్మిది విప్రవరుండు గోలయున్
బాలుఁడుగాన నప్పటికిఁ బైఁబడఁగొంకెనొ కాక వానికి౯
గాలొకచోట నిల్చునె వగ౯ మగుడ౯ నినుఁజూచునంతకున్.

2 చెలికత్తె—వరూధినీ ! ఇకరా ! స్నానానికి కార్యాలు చేయాలి.

(చెలికత్తెలతో వరూధిని నిష్క్రమించును. తెరపడును)

(తెర లో)

శా. హిందూరాజ్యరమాధురంధర భుజాహిగ్రామణీ కంచుక
త్కుందస్వచ్ఛయశోగుళుచ్ఛ ! యవనక్షోణీధవస్థాపనా
మందీభూతకృపాకటాక్ష ! యసకృన్మద్యత్కళింగాంగనా
బందీగ్రాహ విగాహితోత్తరకకుద్ఘాటీసమాటీకనా !



# వరూధినీ ప్రవరాఖ్యము

## చతుర్థాంకము

ప్రదేశము : మూడవ అంకములోని ప్రదేశము.
ప్రవేశము : మాయాప్రవరుని చెలికాడు ప్రవేశించును.

మాయాప్రవరుని చెలికాడు—అదిగో మహాసౌందర్యవతియైన వరూధిని. ఆ గంధర్వకుమారుడైన స్వామిత్రునితో ఈమెను చూచి ఎన్నాళ్లో అయింది.

సీ. ఘనసారపంకమొక్కఁ లతాంగి దెచ్చిన
మట్టిప్రేలనె చుక్కఁబొట్టుపెట్టి
యింతియొక్కతె పూవు టెత్తు లెత్తినఁజూచి
విసువుతో నొకకొన్ని విరులుదుఱిమి
పడఁతి యొక్కతె రత్నపాదుక లిడ నిల్చి
తొడుగక కవ్వలికిఁబో నడుగు వెట్టి
బాగాలు వెన నొక్కఁ పద్మాక్షి యొసఁగిన
వెగ్గలం బని కొన్ని వెడల నుమిసి

తే. సగము గొఱికిన యాకును, సఖులు పిలువ
సగమొసఁగు నుత్తరము, దెల్పి సగము, మఱపు
సగము నయి చింతచే సగ మగుచు నరిగె
న వ్వరూధిని యంతికోద్యానమునకు.

# వరూధినీ ప్రవరాఖ్యము

నా మిత్రుడైన గంధర్వునివలన ఈమె విరహవృత్తాంత మంతా విన్నాను. దేవజాతిత్వజనితవిమలజ్ఞానపాటవంచే తద్ వృత్తాంతము సమస్తం యెరింగి నా మిత్రుడు—

శా. ఏగంధర్వుఁడు తద్విలాసములు మున్వీక్షించి తా నెంతయున్
రాగాంధుండయి కోరి హత్తకగడున్ రారాపులం గంతుఁ డు
ద్వేగం బందఁగఁజేయ నెవ్వగల నువ్విళ్లూరుచున్ వేఁగునాఁ
డాగంధర్వకుమారుఁ డంగభవవిద్యాపారగుం డాత్మలోన్.

ఉ. ఒక్కొకవేళఁ బద్మముఖిలోల్లమి సేయుదు రొక్కవేళఁ బె
న్మక్కువ నాదరింతురు క్షణక్షణముల్ జవరాండ్రచిత్తముల్
పక్కనవేసఁజన దుపాయములన్ దగునిచ్చకంబులన్
జిక్కఁగజేసి డాసి సతిచిత్తముబట్టి సుఖింపఁగాఁదగున్.

అని తలచి మాయాప్రవరునిరూపంతో యిదివరకు తన్ను తిరస్కరించిన వరూధినిని పొందాలని నిశ్చయించుకొన్నాడు. సంగతంతా చెప్పి ప్రవరుని వేషంతో యిప్పుడే వస్తానన్నాడు. అదిగో- వస్తున్నాడు. ఆహా!

సీ. అర్ధచంద్రునితేట నవఘళించు లలాట
పట్టిఁదీర్చిన గంగమట్టితోడఁ
జెక్కుటద్దము లందు జిగి వెల్లువలు చిందు
రమణీయమణికుండలముల తోడఁ
బసిడివ్రాఁత చెఱంగు మిసిమి దోపఁజెలంగు
నరుణాంశుకోత్తరీయంబు తోడ

సరిలేని రాకట్టుజాళువా మొలకట్టు
బెడఁగారు నీర్కావిపింఛెతోడ

తే. ధవళధవళములగు జన్నిదములతోడఁ
గాళికాముద్రయిడిన యుంగరముతోడ
శాంతరసమొల్కు బ్రహ్మతేజంబుతోడఁ
బ్రవరుఁడయ్యె వియచ్చరప్రవరుఁ డపుడు.

(మాయాప్రవరుఁడు ప్రవేశించును.)

చెలికాడు—(నవ్వుచు) నీ యిష్టం; కాని, చూడు అదృశ్యము. జగన్మోహినియైన ఆ వరూథిని కొందఱుసఖులు తన్నుకొలిచి నడవగా—

క. చటులఝుంఝుంకరవపటు
కటకసమాకృష్టకేళికలహంసికయై

సీ. పరిగపూత్కారధూమోగ్రగంధముఁ బాసి
పొలయుఁ బో యీ తావి పూలయు పవనుఁ
దసలాషు పెదబొబ్బనలమిన తలదిమ్ముఁ
బాయుఁబో యీతేంట్లపాటమరుఁడు
ఘర్మసామిధ్యసంకలితదాహస్ఫూర్తి
నాఁగుఁబో యీపిడ నల్లమధుఁడు
గరళసాధర్మ్యతక్రరసుధారటుకత్వ
ముడుపుఁ బో యీ తేనె సోషదీశుఁ

తే. దనరఁగఁ జంపక కురవక పనస తినిశ
నిచుల పంటల దాడిమీ విచికి లామ్ర

వరూధినీ ప్రవరాఖ్యము

పాటలీ పూగ కేసర ప్రముఖతరుల
సొబగుమీఱు నుద్యానంబుఁ జొచ్చి యచట.

విహరించుచున్నది. అదిగో—

మ. పవమానప్లవమానపంకజరజఃపాళీపిశంగచ్ఛవీ
భవదభ్యర్ణవికీర్ణకృత్రిమసరిత్పాథస్తరంగాహతిం
దవపాషాణవితర్దికాతలమునన్నాళీకపత్త్రాక్షి యు
త్సవ మొప్పన్ విహరించుచున్ సరసవాచాప్రౌఢిమల్ మీఱగన్.

ఏమో అనుచున్నారు.

(తెరలో మాటలు వినిపించును.)

(తెరలో ఈ క్రింది పద్యములు వేరువేరు గాత్రముల వినిపించును.
మాయాప్రవరుడు వానిమిత్రుడు వానిని వినుచుందురు.)

చ. బటువయి విష్ణువీఁగి పరిపాటిగఁజూచి పరాగపుంజ మొ
క్కొటఁగలయంగఁజర్వఁగొనగొమ్మను గోయిలమించనొప్పెఁ జెం
గటియెలమావి హారరుచి గందవొడిన్‌గనుపట్టి నీలతా
స్ఫుటతరచూచుకం బగుచుఁ బొల్చు వనేందిరగుబ్బచన్ననన్.

తే. వెలఁది యిచ్చటి సంపెంగవిరులు గహన
దేవతలయిండ్ల నెత్తిన దీపశిఖలు
గాకయుండినఁ బంచబంగాళమగుచుఁ
బాఱునే మత్తమధుకరపటలతమము.

చ. అపరిమితానురాగసుమనోలసయై చిగురాకుఁజేతులన్
దపసిని గౌఁగిలించె వనితా యిదె రంభదలంప రంభ దా

నపరిమితానురాగసుమనోలసయై చిగురాకుఁజేతులన్
దపసిని గౌఁగిలించు టుచితంబె కదాయన నవ్వె రంభయున్.

ఆ. కొమ్మ కన్నుఁగవకు గోరగింపఁగఁబూచి
తలచుకొత్తు గ్రక్కు-దాసనంబు
గవియు నీతమాలగహనాంధకారవి
తానమునకు నుదయభానుఁ డయ్యె.

తే. శ్యామలోపరి నిబిడపత్త్రాభ్రములకు
గాండషండంబు దిగువానకాళ్లుగాఁగఁ
బంకరుహనేత్ర వర్షర్తు శంకనొసఁగు
పోఁకఁబోదియ నవకంపు మోకఁగంటె.

ఉ. చూతిమె డాసి పక్వతరశుక్తిపుటాంతర దృశ్యమౌక్తిక
వ్రాతము లై వెలుంగుగరుపంపుఁగొటారుల నొప్పు తామ్రప
ర్ణీతటమల్లు శీర్ణదళబృందసమావృతపాండురప్రసూ
నాతిమనోజ్ఞమూలముల నర్థి నెసంగు మధూకసాలముల్.

క. పంకజముఖి విరహులపయిఁ
గింకన్ నిజసైన్యకోటికిని సెలవిడు మీ
నాంకుని కరతల మున సల
కంకేళిన్ జిగురుగాలి గదలెడుఁ గంటే.

చ. నునుఁజిగురాకుమేయుతటి నోరి కెలంకులఁ దేఁటి గుట్టినన్
పసతరుశాఖలన్ గువకువ ధ్వనిఁబాఱు పికాంగనన్ బికం
బనునయమొప్ప మాన్పుగతి నాత్మముఖంబు ముఖంబుఁజేర్చి చుం
బనమొనరించె నందునుడిమాయలుగా మగవారి కృత్యముల్.

# వరూధినీ ప్రవరాఖ్యము

చెలికాడు—ఈ అనిమిషకాంతలు ఇప్పుడు ఎంతో ఒయ్యారంగా పువ్వులు కోస్తున్నారు - మిత్రమా! వాళ్లు నీవైపు వచ్చుచున్నట్లున్నారు. ఇక జాగ్రత్త! నేను ఎక్కడో దాఁగుంటా. (ఒక పొదచాటున కూర్చుండును. మాయాప్రవరుడు వరూధినివైపు చూచుచు చూడనట్లు నటించుచుండును.)

చెలికా—క. నాళీకమధూన్మత్తమ
రాళీముఖరాళి సుఖకరంబగు కొలనన్
గేళీలాలసగతి డిగి
యాళీనివహంబు లోల లాడెడు వేళన్.

ఉ. వాడినమోముఁదమ్మి తెలివాలిక కన్నులు విన్నఁబోవఁ దో
నాడక నెన్నొసల్ కరమునం దిడి తీరనిషణ్ణయై జలం
బాడఁగఁ బిల్చువారి నొకహస్తపు మ్రొక్కున నాపుఁదంచుఁదాఁ
జూడక చూచుచూడ్కినలజోటి దెసల్ పరికింప నొక్కచోన్.

మాలిని. రవిరుచిఁ ద్రసరేణువ్రాతముల్ మించువాల్గా
నివహనిహతిలో నిందిందిరశ్రేణులాడన్
గువలయఘనకుల్యాకూలవల్లీవనీ సం
భవము లగుచు మింటన్ బర్వు పుప్పొళ్లఁగోసన్.

(వరూధిని యిద్దరు చెలికత్తెలతో ప్రవేశించును).

(వరూధిని ఈ క్రింది పద్యముల కనుగుణంగా వర్తించును).

చెలికా—సీ. పసిఁడితోరముతోడి బాహువల్లన నెత్తి
సారెకుఁబొదలపైఁ జాఁచి చాఁచి
బింబాధరంబు గంపింప నొయ్యన విపం
చీస్వరంబున జట సెప్పిచెప్పి

## చతుర్థాంకము

దిశల మార్గాన్వేషి దీర్ఘలోచనదీప్తి
గణముచేఁ దోరణ గట్టికట్టి
కమనీయతనుకాంతికనకద్రవంబున
నారామరంగంబు నలికియలికి

తే. యానితంబవిలంబికాలాహికల్ప
ఘనకచగ్రంథి నచటి భృంగముల కసిత
దీధితులు పట్టి కొనఁగుచు దేవపూజ
విరులు చిదిమెడి కపటభూసురునిఁ గనియె.

ఉ. రాంచి తలిర్పణత్క్వణసరత్కాంచిక యై యెదు రేఁగి యప్పు డ
త్క్వణితపేటికసుమగాత్రి వయస్యల డించి తన్నికుం
జాంచలవీథిఁ దాటుచు ఘనాంతచలచ్చపలాకృతిన్ గలన్
గాంచినవస్తువున్ దెలిసి గాంచినయట్లనురక్తిఁ గాంచుచున్.

ఉ. ఆ కమలాక్షి యింపున దృగంచల మించుక మూసి హర్ష బా
ష్పాదులకోణకోణయుచు లగ్రమునన్ బినఁ జూచు చూపు తీ
రై కనుపట్టెఁ బమ్మెరస మంటుకొనన్ వెడవింటివాఁడు క్రో
ధైకధురీణతన్ గలచి యేసిన సింగిణి కోలయో యనన్.

సీ. తొలుచూర్తి వానిఁ గన్నులఁ గాంచి నప్పుడ
పల్లవాధర గుండె జల్లుమనియె
పట తెంపు మ్రోఁదంబ లయగు నప్పుడ కాళ్లఁ
బంకజాక్షికిఁ దొట్రుపాటు గదిరె
దాయంగఁ జనునప్పుడ ముఖాంబుజంబునఁ
గంబుకంధరకు దైన్యంబు దోచెఁ

వరూధినీ ప్రవరాఖ్యము

గదిసి నిల్చిన యప్డ కనుదోయి ఱెప్పల
లలనకు మిగులఁ జంచలత బెరసెఁ

తే. గటకటా యను నపుడ గద్గదిక వొడమెఁ
జెఱఁగు వట్టిన యపుడ లేఁజెమట గ్రమ్మె
సొలసి మాటాడ నుంకింపఁదలచి మోముఁ
దేఱకొనఁ జూచునపుడ కన్నీరు వొడమె.

(చెలికత్తెలు మెల్ల మెల్లగా నిష్క్రమింతురు.)

క. పాటితకరిదంతద్యుతి
పాటచ్చరగండఫలకభాగంబులపైఁ
గాటుక కన్నీ రొలుకఁగ
మాట వెడల గ్రేటుకొనుచు మానిని—

నా మిత్రుని చూస్తున్నది.

వరూధిని—ఓ ప్రవరా! ఎన్నాళ్లకు నీ దర్శనం మళ్లీ—

ఉ. ఏలర యీ చలంబుడిగి యేలర బాలరసాలమాలతీ
జాలములో శశాంకకరజాలములో వలవంత సత్రువుల్
జాలుగ నాల్గు జాలునిఁకఁ జాలు భవంబనునంత కాఁకకుఁజా
బా లయి రాత్రి పంచశరుబారికిఁ జిక్కితి నీకు దక్కితిన్.

శా. రా వైరాగ్యముఁ బూని నీవు కడు నిర్దాక్షిణ్యచిత్తంబునన్
రావైతేఁ జవిగాని యిందులకు హాహోరాహోరిగాఁ బోరి యే
లా వాలాయము సేయఁగా బ్రదుకు నీ వాచారవంతుండవై
చావోయెక్కడొ నీయెడన్ బొడము వాంఛన్ భూసురగ్రామణీ.

క. కట్టఁడి తనమున కిట్లొడి
గట్టి మనసు బాయిసేసి కరఁగవు మఱి నీ
పట్టినది విడువ వింక ని
న్నిట్టట్టననేల మా యదృష్టంబుండన్.

చెలికాడు—ఓహో ! నా మిత్రుడు తన మాయావేషమును కప్పి పుచ్చుటకు ఎంత కష్టపడుతున్నాడు !

సీ. కొనసాఁగి కామినీ గోష్ఠిఁ బ్రౌఢములైన
యుదుటుఁ జూపుల ఱెప్ప తుదల నాఁచి
సంతసంబున ముఖాబ్జమునందుఁ జిఱునవ్వు
కందళింపకయుండ డిందుపఱిచి
పొంగారు మైఁదోచు శృంగార చేష్టల
తమిఁదెచ్చికోలు మౌగ్ధ్యమున డాఁచి
పొడము రసావేశమున వచ్చు నర్మోక్తి
లొదవి నాలుకకు రాకుండఁ గ్రుక్కి

తే. మస్తకము వాంచి యుసురని మౌనముద్ర
నేల బొటవ్రేల వ్రాయుచు నిలిచి కొంత
సేపు వెడవెడ చింతించి శిర సొకింత
'యెత్తె'..........................

(దాని కనుగుణంగా మాయాప్రవరుడు ప్రవర్తించును.)

మాయాప్రవరుడు—(సన్నంపు టెలుగుతో) ఓ వరూధినీ !

శా. తల్లిందండ్రియు నన్నుగానని మనస్తాపంబునం బొక్కఁగా
నిల్లా లార్తిఁ గృశింపఁగా సపనవహ్నిశ్రేణి చల్లారఁగా నిల్లుఁగా

శూన్యత నొంది సొంపు చెడఁగా నిచ్చోట నేఁ జిక్కి యో
ఫుల్లాంభోరుహనేత్ర యే సుఖమతిన్ భోగించెదం జెప్పవే.

ఉ. ఓ సరసీరుహాక్షి వినవో రతిఁగౌఁగిట నీవు చేర్చు నిం
పౌసురభర్తకైనఁ గలదా వలదంచు బెనంగ నేను స
న్న్యాసినె యొక్కటే తహతహన్ మన సొగ్గదు రేళిపై 'నవా
శ్వాసితదుఃఖితే మనసి సర్వ మసహ్య' మనా రెఱుంగవే.

క. ఐనన్ గానిమ్ము భవ
ద్దీనతకై వ్రతము విడిచితిన్ బరులకు మే
లైనన్ జాలు శరీరం
బైన నుపేక్షింపవలయు నని యట్లుండెన్.

క. తివురక యింకొక్కటి విను
కవయునెడన్ వలయుఁ గన్నుఁగవయును మూయన్
భువి నిది యస్మద్దేశ
వ్యవహారము కన్నుఁ దెఱువ నఘమగుఁ దెలివా.

శా. ఈ మర్యాదకు నీ వొడంబడిన మే లీభంగి గాదేని మా
భూమిన్ జేరఁగ నెట్లు నీ యొడలితోఁ బోవంగ లేనే కదా
యీ మందాకిని పొంత నీమునులతో నీ వృక్షవాటంబులో
భామా యేఁదప మాచరింతు విధి కబ్రహ్మణ్యమున్ బెట్టుచున్.

తే. ఇంకనొక్కటి వినుము పూర్ణేందువదన
వ్రతము చెడ సౌఖ్యమైనను వలయుఁ గలుగ
వాంఛితము దీర నను నీవు వదలఁజెల్ల
దేను నిను సమ్మతిలఁజేసి యేఁగు దనుక.

ఇంతయేమిటి కంటేని చెప్పెద. నేను వైదేశికుఁడ; బంధుమిత్ర కళత్రంబులంబాసి దైవయోగంబున నింతదూరం బేఁగుదెంచిన వాడను. మీద భవదర్థంబు ప్రార్థితుండనై వ్రతహోమాద్యనుష్ఠానంబుల విడువంగలవాడనగుటంజేసియంతరంగంబునంగలతెలుంగు తేటపడం బలుకవలసె ; నాకర్ణింపుము.

ఉ. నీ చనుదోయి సంకుమద నిర్భరవాసన మేననూన న
యొ్యా చిర సౌఖ్యముల్ గనుటయొండెఁదపంబొనరించి పాపముల్
రాచుట యొండెఁగా కిహపరంబుల కూరక దూరమై వయ
శ్శ్రీ చన రెంటికిన్ జెడిన రేవఁడ నౌదునె నీరజేక్షణా.

వరూధిని—(మోము వికసింపజేసి చెలుగుబెనచుచు తలవంచి నవ్వుతో)

శా. హా నీ నిష్ఠురవృత్తి మాని కరుణైకాయత్త చిత్తంబునన్
మానన్ జాల నటంచు నేఁడు శ్రవణానందంబుగాఁ బల్కుటన్
సూనాస్త్రున్ వెలవెట్ట కేలితి సుఖార్ణోరాశిలోఁ గ్రుంకితిన్
నా నోముల్ ఫలియించె నా వయసు ధన్యంబయ్యె విప్రోత్తమా.

నీవుచెప్పినట్లే చేస్తాను.

(మాయాప్రవరుని బాహువులతో బంధించును. మాయాప్రవరుడు ఆమెనుకూడా ఆలింగనము చేసుకొనును. తెరలో స్నేహితు రాంద్ర నవ్వు వినిపించును. వరూధినీ మాయాప్రవరులు ఆలింగనము విడతురు.)

వరూధిని—నా స్నేహితురాంద్రని పంపించి వస్తా (నిష్క్రమించును).

(చెలికాడు మాయాప్రవరుని సమీపించును.)

చెలికాడు—మిత్రమా ! ధన్యవాదాలు, ధన్యవాదాలు !

మాయాప్రవరుడు—(ఆశ్చర్యంతో) ఎక్కడున్నావూ !

చెలికాడు—నే నెక్కడున్నానో నాకే తెలియదు ! నా మాటలేమిగాని ఆలస్యము చేయవద్దు. శుభస్యశీఘ్రం. శుభస్యశీఘ్రం.

మాయాప్రవరుడు—(నవ్వుచు) సరే నువ్వింక వెళ్లు.

చెలికాడు—ఆ అలాగె వెళ్లిపోతా - వీళ్లైతే నేనుకూడా దోపలో ఏదో ఒక ఆశ్రయం చూసుకుంటా. ఈ దేవతావాతావరణమే చాలా మంచిది. మానవవాతావరణంలో ఉన్న ఆంక్షలు యిక్కడ లేవు. (నిష్క్రమించును.)

(వరూధిని ప్రవేశించును.)

వరూధిని—ప్రవరా ! వాళ్లను వెళ్లమని చెప్పేను. కాని నన్ను చూచి—

సీ. అకట నిర్దయబుద్ధి వని చూడఁ గడు రంభ
యాహా వివేకి వాడనియె హరిణి
చేఁదు మ్రింగెదవంచుఁ జిలికి నవ్వె ఘృతాచి
మాయలాఁ డని తిట్టె మంజుఘోష
న్యాయనిష్ఠురములఁ బ్రార్థించె నూర్వశి
జంకించె రమ్మంచుఁ జంద్రరేఖ
చెలి నేఁచితని దిసంతులు గొట్టె మేనక
విడువు మాయ లటంచు నుడివె హేమ

తే. గొంట వనియెఁ దిలోత్తమ గూర్మిఁ గొసరె
ధాన్యమాలిని పుంజికస్థల యదల్చె
దివిజకామిను లీరీతిఁ దిరుగు వాఁటి
గువ్వ కోల్గొంచుఁ దమలోన నవ్వుకొంచు.

ఈ పొదచాటికి రా.

(వరూధినీ మాయాప్రవరులు కొంతనడిచి, అధరపానముచేసి
చేతులో చేయికలిపి వెడలుచు)

వరూ— మృగనాభినికరంపు బుగబుగల్ గల చోటఁ
మాయాప్ర- జదలేటి తుంపురుల్ చెదరుచోట
వరూ— వకుళవాటీగంధవహుఁడు పైకొనుచోటఁ
మాయాప్ర- గర్పూరతరుధూళి గప్పుచోటఁ
వరూ— బసమీఱు నెలయేఱు లిసుక వెట్టిన చోటఁ
మాయాప్ర- జిగురు మావుల ఖంజ నిగుడుచోటఁ
వరూ— నవమాలికల తీవె నట్టిట్టు వడుచోట
మాయాప్ర- మాణిక్యదీపముల్ మలయు చోటఁ

వరూ— భ్రమదమునఁ దేఁటు లెలుఁగెత్తి పాడుచోట
మాయాప్ర- శారిక లనంగశాస్త్రముల్ చదువుచోటఁ
వరూ— గీరకలకంఠములు క్రొవ్వి కేరుచోటఁ
మాయాప్ర- బావురము లారజంబులు పలుకుచోట

ఇరువురు కలిసి—మన కేళీవనము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

1 వ చెలికత్తె—(ప్రవేశించును) నేను వరూధిని ప్రాణమిత్రురాలను కాబట్టి యిక్కడనేయుండి ఆమెకు ఏవిధమైన అంతరాయము కలుగకుండా కాపుంటా.

ఆ వరూధిని మణిమండితాలయంబుఁ
గాంచి యనురాగమునఁ బ్రవేశించి యంత

వరూధినీ ప్రవరాఖ్యము

వారి నిరువురఁగూర్చి యవ్వనజగంధు
లాత్మగృహముల కేఁగి రనంతరంబ.

క. పుల్లలవలీనవైలా
వల్లిమతల్లికలతోడ వాసంతిక లు
ద్యల్లీల నల్లిబిల్లిగ
నల్లికొనిన యొక లతాగృహాంతరసీమన్.

ఆ విప్రకుమారుడు ఆగజగమనయు ప్రఫుల్లహల్లకతల్పా భోగంబున రహిమిగులగ పొంగెడు కాంక్షతో ఆనందానుభవం పొందుతుంటారు. ఈ నాటి ఈ సంఘటనవల్ల ఈ వేలుపుముద్దరాలు గర్భందాల్చి ఏ మహాపురుషుని మాత యౌనో! ఏ మను సంభవానికి యిది కారణమవుతుందో! ఏ జగత్కల్యాణం దీనివలన కలుగుతుందో! ఏ మహా కావ్యం దీనినుండి ఉద్భవిస్తుందో !—చాలా కాలమైంది. కాని వరూధినీ ప్రవరులకు అలా కనిపించదు. అదిగో—

(వరూధిని ప్రవేశించును.)

చెలికత్తె—(నవ్వుతో) వరూధినీ! ఏమైంది?

వరూధిని—(చిరునవ్వుతో) ఏమైందా! (చేయి చెలికత్తెపైన వైచి.)

సీ. సహసానఖంపచస్తనదత్తపరిరంభ
మామూలపరిచుంబితాధరోష్ఠ
మతిశయప్రేమకల్పితదంతసంబాధ
మగణితగ్లానిశయ్యానిపాత

మతివేలమణితయాష్ఠార్థగల్లచపేట
మతిదీనవాష్పాచితాత్మవిరహ
మంకురత్పులకజాలావిద్ధసర్వాంగ
మానందకృత హా రవాననాబ్జ

తే. మాక్రమక్షీణనుతివర్ణ మానిమీలి
తాక్ష మాస్విన్నగండ మాయత్తచేష్ట
మాస్తిమితభూషణారవ మా వధూటి
ప్రథమసురతంబు గంధర్వపతి గరంచె.

యింకా చాలా ఉన్నది.

(చెరికత్తెను లాగుచు యిద్దరు నిష్క్రమింతురు.)

(తెరలో)

రాజపరమేశ ఫణిరాజబల ఫుల్లాం
భోజముఖ భోజముఖభూపవిపులాంసో
త్తేజితధరాభరణ దీక్షితభుజాని
ర్వ్యాజభయదాజివిజితారినృపరాజీ.

సమాప్తము

---

రినైసాన్సు ముద్రణాలయము, త్యాగరాయనగరము, మద్రాసు